# గాయత్రీ సాధన ఎందుకు, ఎలా?

రచన :

డా॥ ప్రణవ పండ్యా (ఎమ్.డి.)

అనువాదం :

పూటుకూరి సత్యనారాయణగుప్త,

చీరాల.

ప్రచురణ :

యుగనిర్మాణ మిషన్ ప్రెస్

మధుర, ఉత్తర ప్రదేశ్

## గాయత్రీ సాధన ఎందుకు, ఎలా?

ఆదిశక్తి, వేదమాత, దేవమాత, విశ్వమాత రూపంలో గాయత్రీ యొక్క పరిచయము-

గాయత్రీ పరమాత్మ యొక్క ఏ ఇచ్ఛాశక్తి. దాని కారణముగా సృష్టి మొత్తం నడుచుచున్నది. చిన్న పరమాణువు మొదలుకొని పూర్తి విశ్వ బ్రహ్మాండం వరకు మరియు నదులు పర్వతముల నుంచి పృథ్వి, చంద్రుడు మరియు సూర్యుని వరకు ఆమె యొక్క శక్తి ప్రభావము వలననే చరిస్తున్నాయి. వృక్షములు-వనస్పతులలో జీవన తరంగములు ఆ శక్తి కారణంగానే పైకి పొంగుచున్నాయి. ఇతర ప్రాణుల యొక్క పని తేలికగా జరుగుటకు అవసరమైనంత ఆ శక్తియొక్క అంశ ఉన్నది. మనిషిలో ఆ శక్తి సాధారణ రూపంలో మస్తిష్కంలో బుద్ధి రూపంలో హాజరై ఉంటుంది. తన జీవన నిర్వహణ మరియు సుఖ-సౌకర్యాలు పెంపొందించుకునే పని అతను దీని సహాయంతోనే పూర్తి చేస్తాడు. అసాధారణ రూపంలో ఈ శక్తి ' ఋతంభరా ప్రజ్ఞ' అనగా సద్బుద్ధి రూపంలో ప్రకటితమవుతుంది. ఇది తప్పొప్పుల జ్ఞానము కలుగజేసి జీవన లక్ష్యం మార్గములో ముందుకు తీసుకెళ్తుంది. సాధారణముగా ఇది మనిషి యొక్క మనసు లోతులలో నిద్రిస్తూ ఉంటుంది. దీనిని ఏవిధంగా మేల్కొలుపుతామో దానిని 'సాధన' అని అంటారు. దీనిని మేల్కొలపవలసిన మనిషి యొక్క సంబంధము భగవంతుని శక్తితో జోడించబడుతుంది.

పరమాత్మ స్వయముగా మౌలిక రూపంలో నిరాకారుడు, అన్నిటినీ తటస్థ భావముతో చూస్తూ శాంతియుత అవస్థలో ఉంటారు. సృష్టి ప్రారంభములో ఆయనకు ఒకటి నుండి అనేకము అయ్యే కోరిక కలిగినపుడు, ఆయన ఈ కోరిక శక్తిగా తయారైనది. ఈ శక్తి సహాయముతోనే మొత్తం సృష్టి తయారై నిలబడినది. సృష్టిని తయారుచేసే ప్రారంభిక శక్తి అయిన కారణముగా దీనిని 'ఆదిశక్తి' అని

అన్నారు. పూర్తి విశ్వ వ్యవస్థ వెనుక మరియు లోపల కనబడే సంతులనము మరియు సువ్యవస్థ గాయత్రీ శక్తి యొక్క పనియే. దీని ప్రేరణ ద్వారా విశ్వ బ్రహ్మాండం యొక్క అన్ని అల్ల కల్లోలములు ఏదో ప్రత్యేక ఉద్ధేశ్యములతోపాటు తమ మహ యాత్రలో ముందుకు సాగుతున్నాయి.

బ్రహ్మకు సృష్టి నిర్మాణము మరియు విస్తారము కొరకు అవసరమైన జ్ఞానము, క్రియా కౌశలము ఆయనకు ఆదిశక్తి గాయత్రి యొక్క తపోసాధన ద్వారానే లభించినది. ఇదే జ్ఞాన-విజ్ఞానము వేదము అనబడినది. ఈ రూపంలో ఆదిశక్తి యొక్క పేరు వేదమాత అయినది. అనగా వేదముల సారము గాయత్రీ మంత్రములో బీజ రూపంలో నిండి ఉన్నది.

సృష్టి యొక్క వ్యవస్థను రక్షించు మరియు నడిపించు వి భిన్న దైవ శక్తులు ఆదిశక్తి యొక్క ధారలే. ఏవిధముగా ఒకే విద్యుత్ శక్తి వేరు వేరు పనులు చేసే యంత్రములకు అనుగుణముగా బల్బు, ట్యూబ్‌లైట్, హీటరు, రెఫ్రిజిరేటర్, కూలర్ మొదలైన వేరు వేరు రూపములలో పనిచేసి చూపిస్తుందో, అదేవిధముగా ఒకే ఆదిశక్తి నిర్మాణము, పర్యవేక్షణ, పరివర్తనము మొదలైన క్రియలకు అనుగుణముగా బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుడు వంటి దైవశక్తుల రూపంలో విడివిడిగా ప్రతీతమౌతుంది. ఇదేవిధముగా ఇతర దైవశక్తులు కూడా దీనియొక్క వివిధ ధారలు దీనినుంచే పోషణ పొందుతాయి. ఈ రూపములో దీనిని 'దేవమాత' అనే పేరుతో పిలుస్తారు. దేవమాత అనుగ్రహమును పొందు సామాన్య వ్యక్తి కూడా దైవముతో సమానమైన గుణములు మరియు శక్తి కలిగిన వాడుగా తయారవుతాడు.

విశ్వ ఉత్పత్తి మొత్తం ఆదిశక్తి గర్భములో జరిగినది. కనుక దీనిని విశ్వమాత అనే పేరుతో గూడ పిలుస్తారు. ఈ రూపంలో తల్లియొక్క కృపను పొందిన వ్యక్తి విశ్వమానవుడై "వసుధైక కుటుంబకమ్" అనగా విశ్వము మొత్తము తన కుటుంబం అనే ఉదారభావముతో జీవిస్తాడు.

గాయత్రీ శక్తి ఏమిటి? - ప్రాణముల నుద్ధరించు సామర్థ్యము కారణముగా ఆదిశక్తి గాయత్రి అనబడినది. ఐతరేయ బ్రాహ్మణ గ్రంథములో ఈ అర్థమును స్పష్టము చేస్తూ వ్రాయబడినది-' గయాన్ త్రాయతేసా గాయత్రీ" అనగా ఏది గయ - ప్రాణమును రక్షిస్తుందో అది గాయత్రి. శంకరాచార్య భాష్యములో గాయత్రీ శక్తిని స్పష్టం చేస్తూ చెప్పబడినది. 'గీయతే తత్త్వమనాయ గాయత్రీతి' అనగా ఏ వివేకబుద్ధి - ఋతంభరా ప్రజ్ఞ ద్వారా వాస్తవికత యొక్క జ్ఞానము లభిస్తుందో అది గాయత్రి.

సత్యము మరియు అసత్యము, తప్పు మరియు ఒప్పు, ఏమి చేయాలి మరియు ఏమి చేయకూడదు. వీటి నిర్ణయము సరైన విధముగా చేయు సద్బుద్ధి ఎటువంటి అద్భుత శక్తి అంటే దీనితో పోల్చినపుడు విశ్వంలోని మరే శక్తి మనిషికి ఉపయోగకరం కాదు. మరొక విషయమేమనగా ప్రాపంచిక బుద్ధికుశలత ఎంత చతురతతో నిండి ఉన్నాకాని, ఎంత తీక్షణంగా ఉన్నా, ఎంత సారవంతం మరియు ఫలవంతము అయినా దానివలన నిజమైన మేలు జరుగదు. అంతర్గత సుఖము, శాంతి కనబడదు. భోగ విలాసములకవసరమైన చాలా సామాగ్రిని అది తప్పక సంపాదించగలదు. కాని వీటివలన చింత, కోపము మరియు అహంకారము మొదలైనవే పెరుగుతాయి. వీటి భారము జీవితమును ఎక్కువ కష్టదాయకముగా చేస్తాయి. అది కొద్దిగా బాహ్యంగా తళుకు-బెళుకు చూపి అంతరంగ శాంతి మొత్తమును నాశనము చేస్తుంది. దీని కారణముగా అనేకమైన శారీరక, మానసిక రోగాలు ఉత్పన్నమౌతాయి. అవి ప్రతిక్షణము వ్యాకులపడేట్లు చేస్తాయి. ఇటువంటి బుద్ధి ఎంత తీక్షణంగా ఉంటుందో అంతగా ఆపదలకు కారణమౌతుంది. ఇటువంటి బుద్ధికంటే మందబుద్ధి కలిగి యుండుటయే మంచిది.

గాయత్రి మంచి గుణములు, మేలు చేసే తత్త్వములతో నిండిన బుద్ధి యొక్క పేరు. దీని ప్రేరణతో మనిషియొక్క శరీరము మరియు

మస్తిష్కము ఎటువంటి దారిలో నడుస్తుందంటే అడుగడుగునా శుభములే కలుగుతాయి. ప్రతి అడుగులో ఆనందము సంచరిస్తుంది. ప్రతి పని దానిని ఎక్కువ పుష్టిగా, శక్తివంతముగా మరియు బలముగా తయారుచేస్తుంది. అది దినదినము అధికమైన గుణములు మరియు శక్తివంతముగా తయారువుతూ ఉంటుంది. మరైతే దుర్బుద్ధి నుంచి పుట్టిన ఆలోచనలు, పనులు మన ప్రాణశక్తిని ప్రతిరోజు తగ్గించి వేస్తూ ఉంటాయి. తప్పుడు అలవాట్లు, దుర్వ్యసనములలో శరీరము రోజురోజుకు బలహీనమై పోతుంది. స్వార్థంతో నిండిన ఆలోచనలతో మనసు ప్రతిరోజూ పాపం యొక్క బురదలో కూరుకుపోతూ ఉంటుంది. ఈవిధంగా జీవితమనే పాత్రలో రంధ్రములు ఏర్పడుతూ ఉంటాయి. దానివలన సంపాదించిన శక్తి అంతా నాశనమై పోతుంది. అతను ఎంత బుద్ధి ఉపయోగించినా, కొత్తగా సంపాదన చేసినా కాని స్వార్థము, భయము మరియు లోభము మొదలైన వాటి కారణముగా మనసు ఎప్పుడు దుఃఖముతోనే ఉంటుంది. మానసిక శక్తులు నాశనమైపోతూ ఉంటాయి.

ఇటువంటి దుర్బుద్ధితో అమూల్యమైన జీవితమును వ్యర్థముగా కోల్పోయే వ్యక్తుల కొరకు గాయత్రీ ఒక ప్రకాశము, ఒక నిజమైన ఆధారము, ఒక ఆశాజనకమైన సందేశము, అది వారి సద్బుద్ధి మేల్కొలిపి ఈ ఊబినుండి బైటికి లాగుతుంది, వారి ప్రాణములను రక్షిస్తుంది మరియు జీవితములో సుఖము, శాంతి మరియు ఆనందముల ద్వారము తెరుస్తుంది.

ఈవిధముగా గాయత్రీ ఏదో దేవీ దేవత లేక కల్పిత శక్తి కాదు, కాని భగవంతుని ఇచ్ఛాశక్తి, అది మనిషిలో సద్బుద్ధి రూపంలో ప్రకటితమై అతని జీవితమును సార్థకము మరియు సఫలము చేస్తుంది.

జీవితము మరియు సృష్టి రహస్యముల శోధనలో సాధనాపరులైన ఋషులు ధ్యానము యొక్క లోతులలో పొందిన

దేమనగా వీటికి మూలంలో సక్రియమైన శక్తులు శబ్ద రూపంలో ఉన్నాయి. ఆది శక్తియొక్క సాక్షాత్కారము 24 అక్షరముల మంత్ర రూపములో జరిగినది. ప్రాణములను రక్షించే సామర్థ్యమున్న కారణముగా ఆమె పేరు గాయత్రీ అయినది. దీనిని శోధించి సాధించిన పుణ్యము రుషి విశ్వామిత్రునకు చెందుతుంది.

<u>గాయత్రీ మంత్ర ఉచ్చారణ వలన దివ్యశక్తుల జాగరణ :</u>

గాయత్రీ మహామంత్రము యొక్క ప్రత్యేకత యొక్క భౌతిక కారణము దీని అక్షరముల పరస్పర కూర్పు, అది ఎటువంటి స్వర విజ్ఞానము మరియు శబ్ద శాస్త్ర రహస్యమయ ఆధారముపై జరిగినదంటే దాని ఉచ్చారణ మాత్రంచే సూక్ష్మ శరీరములో దాగి ఉన్న అనేక శక్తి కేంద్రములు వాటంతట అవే తాము జాగృతమవుతాయి. దివ్యదృష్టి కల ఋషుల ననుసరించి సూక్ష్మ శరీరములో అనేక చక్రములు-ఉపచక్రములు, ముడులు-కోశములు, మాతృకలు - ఉపత్యికలు మరియు సూక్ష్మనాడులు నిండి ఉన్నాయి, అవి మేల్కొన్నపుడు వ్యక్తి అనేక గుణములు మరియు శక్తులకు యజమాని అవుతాడు.

గాయత్రీ మంత్రము యొక్క 24 అక్షరముల ఉచ్చారణ వలన నోరు, పెదవి, కంఠము, అంగిలి, కొండనాలుక మొదలైన వాటిపై కలిగించే వత్తిడి కారణముగా వీణ తంత్రుల వలె కంపిస్తాయి ఒక స్వర లహరి ఉద్భవిస్తుంది, దాని ప్రభావము వలన లోపల ఉన్న సూక్ష్మ గ్రంథులు జాగృతమై తమ శక్తిని ప్రకటితము చేయుట మొదలుపెడతాయి. ఈవిధముగా సాధకుడు ఒక అయస్కాంత శక్తిచే నింపబడతాడు. అది బ్రహ్మాండంలో వ్యాపించి ఉన్న గాయత్రీ శక్తి మరియు దాని ధారలను ఆకర్షించి లోపల నింపుట మొదలవుతుంది. గాయత్రీ యొక్క శక్తి తరంగములు రేడియో లేక దూరదర్శన్ ప్రసరణ యొక్క విద్యుత్- అయస్కాంత ధారలవలె ఆకాశంలో వ్యాపించి ఉన్నాయి. గాయత్రీ మంత్ర ఉచ్చారణ వలన ఉత్పన్నమైన

అయస్కాంతత్వము సాధకుని మనసును ఆ స్థాయిపై 'ట్యూన్' చేస్తుంది వాటితో సంపర్కము జోడిస్తుంది. ఈవిధముగా యోగులు కఠోరపతప-సాధనల ద్వారా చాలా ఎక్కువ సమయములో పూర్తి చేయుపని గాయత్రీ జపము ద్వారా కొద్ది సమయములోనే తేలికగా పూర్తి అవుతుంది.

గాయత్రీ మంత్రము యొక్క శబ్ద శక్తితో పాటు వ్యక్తి సాధన ద్వారా శుద్ధి చేయబడిన సూక్ష్మ ప్రకృతి అనగా అతని మంచి సంకల్పము మరియు శ్రేష్ఠమైన ఆలోచనలు కలిసినపుడు రెండు కారణములు గాయత్రీ శక్తిని ఎటువంటి బలమైనదిగా చేస్తుందనగా ఇది సాధకుల కొరకు దైవ వరదానముగా రుజువవుతుంది. గాయత్రీ మంత్రమును ఇంకా శక్తి శాలిగా తయారుచేయు కారణము సాధకుని శ్రద్ధ మరియు విశ్వాసము. విశ్వాసము యొక్క శక్తి అందరికీ తెలుసు. చీపురును భూతముగాను, తాడును పాముగాను మరియు రాయిని దేవతగా తయారుచేసే సామర్థ్యము విశ్వాసంలో ఉన్నది. రామాయణంలో తులసీదాసు " శ్రద్ధ -విశ్వాసము"లను భవాని శంకరులతో పోల్చారు.

కనుక గాయత్రీ సాధకుడు శ్రద్ధ మరియు విశ్వాసముతో సాధన చేస్తే శబ్ద శక్తి మరియు మంచి సంకల్పములతో జతపరచబడిన గాయత్రీ సాధన ప్రభావము ఇంకా పెరుగుతుంది. ఇది ఒక అద్భుతమైన శక్తిగా రుజువవుతుంది.

గాయత్రీ మూడు గుణముల శక్తి. హ్రీం -సద్బుద్ధి, శ్రీం - సమృద్ధి మరియు క్లీం - శక్తి ప్రధానము. దీనికి మూడు విశేష ధారలు కలవు. వీటిని గంగ, యమున, మరియు సరస్వతిల త్రివేణీ సంగమం అని కూడా అనవచ్చును. దైవశక్తులతో జోడించినపుడు వీటిని సరస్వతి, లక్ష్మి, కాళి మరియు బ్రహ్మ, విష్ణు మహేశ్వర రూపంలో తెలుసుకొనగలము. వేదమాత, దేవమాత, విశ్వమాత దీనియొక్క మూడురూపములు. గాయత్రీ సాధనతో సాధకుని మనసు, బుద్ధి

మరియు భావనలు ఈ త్రివేణిలో స్నానం చేసే అవసరం లభించినపుడు, స్థితి కాయకల్పం వలె తయారవుతుంది.

## సద్గుణములను పెంపొందించే అంతర్గత మార్పు

గాయత్రీ సాధన ద్వారా వ్యక్తిలో జరిగే అసాధారణ మార్పు యొక్క మొదటి ప్రభావము అతని అంతఃకరణముపై పడుతుంది. ఇది అతని ఆలోచనలను, మనసు మరియు భావములను సరైన మార్గములో నడుచుటకు ప్రేరేపిస్తుంది. వ్యక్తిలో మంచి గుణముల పెరుగుదల ఆరంభమవుతుంది. దీనివలన అతని దోష దుర్గుణములలో తగ్గుదల వస్తుంది. ఈవిధముగా సాధకునిలో అతని జీవితమును ఎక్కువ సరళము, సఫలము మరియు శాంతిమయం చేయుటలో సహాయపడే అనేక గుణ విశేషతలు జన్మిస్తాయి.

మంచి గుణములు వృద్ధి చెందిన కారణముగా శారీరక క్రియలు మరియు పద్ధతులలో భారీ మార్పు జరుగుతుంది. ఇంద్రియ వ్యసనములతో దారి తప్పుట తగ్గుతుంది. నాలుక యొక్క తిండిపోతు లక్షణం మరియు తప్పుడు ఆహారపు అలవాట్లు నిదానముగా బాగుపడుట జరుగుతుంది. ఇదేవిధముగా కామేంద్రియముల ఉత్తేజనపై సంయమనము అలవడుతుంది. చెడు మార్గములో, వ్యభిచారములో, కోరికలలో మనసు తక్కువగా పరిగెడుతుంది. బ్రహ్మచర్యము పట్ల శ్రద్ధ పెరుగుతుంది. దానివలన వీర్యం రక్షించబడే మార్గము శుభ్రపడుతుంది. కామేంద్రియము మరియు స్వాదేంద్రియము (రుచి) ఈ రెండే ప్రధాన ఇంద్రియములు. ఇవి సంయమితమగుట తోటనే ఆరోగ్య రక్ష మరియు రోగరహిత యొక్క మార్గము తెరుచుకుంటుంది. తన దినచర్యలో స్వచ్ఛత, సువ్యవస్థ మరియు శ్రమ - సంతులనము యొక్క క్రమము జోడించబడుతుంది. ఆ కారణముగా

ప్రగతి మరియు సఫలత యొక్క దిశ స్పష్టమౌతూ ఉంటుంది.

మానసిక క్షేత్రములో సద్గుణములు వృద్ధి చెందిన కారణముగా సోమరితనము, అధీరత, వ్యసనము, క్రోధము, భయము, చింత వంటి దుర్గుణములు తగ్గుతూ ఉంటాయి. ఇవి తగ్గుటతో పాటు సంయమనము, స్ఫూర్తి, సాహసం, ధైర్యం, వినమ్రత, సంతోషము, సద్భావము, వంటి గుణములు పెరుగనారంభమౌతుంది. ఈ అంతర్గత మార్పు యొక్క ఫలితము ఏమౌతుందంటే మూర్ఖత్వము వలన జనించే అనేక భ్రమ-దారి తప్పుట నుండి విముక్తి లభిస్తుంది. దైనిక జీవితములో నిత్యము ఆచరించి ఉంటే దుఃఖములకు సహజమైన పరిష్కారము జరుగుతూ పోతుంది. సంయమనము, సేవ, నమ్రత, ఉదారత, దానము, నిజాయితీ వంటి గుణముల కారణముగా ఇతరులకు కూడా లాభం జరుగుతుంది. హాని జరిగే అనుమానముండదు. కనుక తరచుగా జనమంతా కృతజ్ఞులు, ప్రశంసకులు, సహాయకులు, రక్షకులవుతారు. పరస్పర సద్భావన మరియు కృతజ్ఞత వలన ఆత్మను తృప్తిపరచే ప్రేమ మరియు సంతోషమనే పేరుగల ఆనందము రోజురోజుకి అధిక ప్రమాణములో లభిస్తూ ఉంటుంది. జీవితము ఆనందమయమై పోతూ ఉంటుంది. ఇది కాక ఈ గుణములు తమంత తాము ఎంత మధురమైనవంటే శీతల ప్రవాహము ప్రవహిస్తూ ఉంటుంది అనగా గాయత్రీ సాధన మనిషిలో గాఢమైన పరివర్తన తెచ్చి సుఖము-శాంతి యొక్క మార్గమును తెరుస్తుంది.

సమృద్ధి మరియు సఫలత ఇచ్చే గాయత్రి. సద్గుణముల వృద్ధి, అంతర్గత శాంతి, సంతోషంతో పాటు గాయత్రీ సార్వజనిక సమృద్ధి - సఫలత యొక్క మార్గమును కూడా తెరుస్తుంది. శరీరము మరియు మనసు యొక్క శుద్ధి, బాహ్య జీవితమును ఎన్నోవిధములుగా సుఖ-సంపన్నముగా తయారుచేస్తుంది. తెలివితేటలు మరియు ఆత్మవిశ్వాసము పెరుగుటచే మొదట్లో కొండంత భారమనిపించే

అనేకమైన కష్టములు ఇపుడు గడ్డిపరకలు వలె తేలిక అనిపిస్తాయి.

ఇపుడు జీవితములో క్లేశము మరియు అనిశ్చిత కూడా తగ్గనారంభమౌతుంది. ఎందువల్లననగా వ్యక్తి యొక్క కోరికననుసరించి పరిస్థితులైనా మారవచ్చును లేక అతను పరిస్థితులకనుగుణముగా తన కోరికలను మార్చుకొనవచ్చును. క్లేశమునకు కారణము కోరిక మరియు పరిస్థితుల మధ్యనున్న పోట్లాటే. తెలివైన వాడు ఆ రెండింటి నుంచి ఏదో ఒకదానిని ఎన్నుకొని పోట్లాటను నివారిస్తాడు. మరియు అనవసరమైన వ్యాకుతల నుండి రక్షించబడుతాడు. ఈ విధముగా జీవితము యొక్క మార్గము సూటిగాను మరియు సులభముగాను తయారువుతుంది.

నిజానికి సుఖము మరియు ఆనందము బాహ్య సాధన-సామాగ్రివలన లభించవు, ఇవి వ్యక్తి యొక్క మనఃస్థితిపై ఆధారపడి యున్నవి. రాజసమైన భోగము మరియు పట్టుపరుపులతో నైనా సంతోషపడని మనస్సు, అదే మనస్సు ఎవరైనా సాధువు యొక్క ఉపదేశములతో త్యాగము-సన్యాస వ్రతము స్వీకరించినపుడు అడవి ప్రదేశమే అన్నింటికంటే విశ్రాంతి కలిగించే పీఠముగా భావిస్తాడు . కందమూల ఫలములనే అన్నింటికంటే రుచికరమైన భోజనముగా భావిస్తాడు. ఈ మనఃస్థితి ఆలోచనలు మారినందువలన కలిగిన పరిణామము.

నిజమునకు గాయత్రి మూడు గుణముల శక్తి, దీని సాధన వలన సత్వగుణము పెరిగినచోటనే ఉపయోగకరమైన రజోగుణము కూడా పెరుగుతుంది. దానివలన మనిషియొక్క రహస్య శక్తులు జాగృతమౌతాయి. ప్రాపంచిక జీవిత సంఘర్షణలో ఆశాజనకమైన పరిణామము జన్మిస్తుంది. ఆశ, ఉత్సాహము, తీక్షణమైన బుద్ధి, అవకాశమును గుర్తించుట, పలుకులో మాధుర్యము, వ్యక్తిత్వములో ఆకర్షణ వంటి విశేషతలు వికసింపనారంభిస్తాయి. గాయత్రి

ఉపాసకుని లోపల లోపలే కొత్త చట్రము మూస తయారై అందులో ఎటువంటి మార్పులు జరుగుతాయంటే సామాన్య వ్యక్తి కూడా క్రమంగా సద్బుద్ధి, సఫలత మరియు ఉన్నతి వైపు ముందుకు సాగుతుంటాడు. గాయత్రీ సాధన బంగారపు నాణేములు కురిపించకపోయినా సాధకునిలో ఎటువంటి ప్రత్యేకతలను జనింపజేస్తుందంటే అది లేమితో నిండిన, దీన-హీన మరియు దరిద్ర స్థితిలో ఉండలేడు.

సంకట మోచన గాయత్రి: ప్రారబ్ధము లేక కష్టములతో నిండిన పరిస్థితులు ప్రతివ్యక్తి జీవితములో వస్తాయి. ఈ కష్టముల చక్రములో చిక్కుకున్న వారియొక్క ఆపదలు పెరుగుతూ పోతాయి. అస్వస్థత, కలహం, ధనము నష్టపోవుట, దాడి, ఆపద, శోకము వియోగము మొదలైన వాటి గాలి నడుస్తున్నపుడు తగ్గిపోవుట అనే మాటే ఉండదు. ఆపదలు ఒంటరిగా రావు. అవి ఎల్లప్పుడూ తమ పిల్లపాపలను కూడా వెంట తీసుకొస్తాయి. అనే సామెత కూడా ఉంది. నాలుగువైపుల నుండి కష్టములచే చుట్టుముట్టబడియున్న వ్యక్తి స్వయంగా చక్ర వ్యూహంలో ఉన్నట్లు భావిస్తాడు. ఇటువంటి విపత్కర పరిస్థితులలో సాధారణ జనము చనిపోతున్నట్లు భావిస్తారు మరియు భయం, చింత మరియు గాభరాలలో కాళ్లు, చేతులు ఆడించలేరు. ఏడుపులు- పెడబొబ్బలు పెడుతుంటారు మరియు చాలాకాలం వరకు ఇంకా ఎక్కువ కష్టాలు అనుభవిస్తారు.

కాని గాయత్రీ సాధకుడు తెలివి, ధైర్యం, సాహసం మరియు భగవంతునిపై విశ్వాసముపై ఆధారపడి వీటిని తేలికగా దాటగలుగుతాడు. నిజానికి కష్టముల నదిని దాటుటకు ధైర్యము, సాహసము, ప్రతిభ మరియు ప్రయత్నము అనే నాలుగు మూలలు కల నావ అవసరమవుతుంది. గాయత్రీ సాధన ఈ నాలుగు ప్రత్యేకతలను మనిషిలో బాగా పెంపొందిస్తుంది. దానివలన అతను కష్టములను కూడా తను దాటగలిగిన మార్గమును వెదుకుటలో సఫలము కాగలడు.

ఉపాసకుని లోపల లోపలే కొత్త చట్రము మూస తయారై అందులో ఎటువంటి మార్పులు జరుగుతాయంటే సామాన్య వ్యక్తి కూడా క్రమంగా సద్బుద్ధి, సఫలత మరియు ఉన్నతి వైపు ముందుకు సాగుతుంటాడు. గాయత్రీ సాధన బంగారపు నాణేములు కురిపించకపోయినా సాధకునిలో ఎటువంటి ప్రత్యేకతలను జనింపజేస్తుందంటే అది లేమితో నిండిన, దీన-హీన మరియు దరిద్ర స్థితిలో ఉండలేడు.

<u>సంకట మోచన గాయత్రి</u>: ప్రారబ్ధము లేక కష్టములతో నిండిన పరిస్థితులు ప్రతివ్యక్తి జీవితములో వస్తాయి. ఈ కష్టముల చక్రములో చిక్కుకున్న వారియొక్క ఆపదలు పెరుగుతూ పోతాయి. అస్వస్థత, కలహం, ధనము నష్టపోవుట, దాడి, ఆపద, శోకము వియోగము మొదలైన వాటి గాలి నడుస్తున్నపుడు తగ్గిపోవుట అనే మాటే ఉండదు. ఆపదలు ఒంటరిగా రావు. అవి ఎల్లప్పుడూ తమ పిల్లపాపలను కూడా వెంట తీసుకొస్తాయి. అనే సామెత కూడా ఉంది. నాలుగువైపుల నుండి కష్టములచే చుట్టుముట్టబడియున్న వ్యక్తి స్వయంగా చక్ర వ్యూహంలో ఉన్నట్లు భావిస్తాడు. ఇటువంటి విపత్కర పరిస్థితులలో సాధారణ జనము చనిపోతున్నట్లు భావిస్తారు మరియు భయం, చింత మరియు గాభరాలలో కాళ్లు, చేతులు ఆడించలేరు. ఏడుపులు- పెడబొబ్బలు పెడుతుంటారు మరియు చాలాకాలం వరకు ఇంకా ఎక్కువ కష్టాలు అనుభవిస్తారు.

కాని గాయత్రీ సాధకుడు తెలివి, ధైర్యం, సాహసం మరియు భగవంతునిపై విశ్వాసముపై ఆధారపడి వీటిని తేలికగా దాటగలుగుతాడు. నిజానికి కష్టముల నదిని దాటుటకు ధైర్యము, సాహసము, ప్రతిభ మరియు ప్రయత్నము అనే నాలుగు మూలలు కల నావ అవసరమవుతుంది. గాయత్రీ సాధన ఈ నాలుగు ప్రత్యేకతలను మనిషిలో బాగా పెంపొందిస్తుంది. దానివలన అతను కష్టములను కూడా తను దాటగలిగిన మార్గమును వెదుకుటలో సఫలము కాగలడు.

గాయత్రి నిజానికి చాలా అద్భుత సాధన. దీని ప్రభావం వలన ఎన్నోమార్లు మనిషి కష్టములనుండి ఎలా బైటపడతాడంటే దానిని దైవ సంబంధమైన అద్భుతమని తప్ప ఇంకేమీ కాదని చెప్పవచ్చును. దీని వెనుక ఉన్న నిజమేమనగా గాయత్రీ సాధన కారణముగా సాధకునిలో కొన్ని దైవ శక్తులు వికసిస్తాయి. అవి కష్టకాలములో అతనికి సహాయపడతాయి. తరచుగా గమనించేదేమంటే ఏవ్యక్తి సాధన చేసి తన మనసు మరియు బుద్ధిని నిగ్రహించుకొని మరియు శుద్ధి చేసుకుంటాడో మరియు ఈర్ష్యా ద్వేషములను వదలి ఇతరుల పట్ల శుభకరమైన భావం కలిగి ఉంటాడో, అతని రక్షణ దైవశక్తులు స్వయంగా చేస్తాయిట.

భూమిపై నున్న కామధేనువు గాయత్రి: పురాణములలో చెప్పబడినట్లు స్వర్గములో దేవతల వద్ద కామధేనువు ఉన్నది. అది అమృతం వంటి పాలనిస్తుంది. ఆ పాలను త్రాగి దేవతలు ఎల్లప్పుడూ సుఖం, సంతుష్టం మరియు ప్రసన్నంగా ఉంటారు. దీనికి ఇంకొక ప్రత్యేకత ఏమంటే దీని సమీపమునకు వెళ్ళేవారి కోరికలన్నీ తీరుతాయి.

స్వర్గములోని కామధేనువుని గురించిన నిజము దేవతలకే తెలుసు. కాని ఈ భూమిపై ఈ కామధేనువైన ఆవు గాయత్రి శక్తియే. గాయత్రీ ఉపాసన వలన అన్ని కోరికలు(తృష్ణలు) శాంతించడం మొదలవుతుంది. అసంభవమైన, అనావశ్యకమైన మరియు ఉపయోగం లేని కోరికలు శాంతించడం వలన తనకు తాను ఆ స్థితిని పొందుతాడు. దానిని మనో కామన పూర్తియగుట అంటారు. కామధేనువు పాలు తాగి పాప-తాపములకు దూరమవుతారు. గాయత్రీని శరణుజొచ్చి దాని అమృతరసము తాగేవాడు కూడా తన దుఃఖములు -కష్టములు మరియు పాప-తాపముల నుండి తేలికపడతారు.

నిజానికి మానవుని అసలైన రూపము ఆనందముతో నిండి

ఉంటుంది. ఆనందమగ్నముగా ఉండుటయే అతని ప్రధాన లక్షణము. దుఃఖములు తొలగుట మరియు నశించిన వెంటనే అతను మౌళిక స్వరూపమునకు చేరుతాడు. మనిషి కూడా అతని కష్టములకు కారణమైన వాటికి పరిష్కారం దొరికినపుడు స్వర్గంలోని దేవతలవలె ఆనందంగా ఉండగలడు. గాయత్రీ సాధన ఇదే పని చేస్తుంది.

మనిషి దుఃఖితుడు మరియు వ్యాకులుడై ఉండుటకు మూలము మూడే కారణములు 1. అజ్ఞానము అనగా తెలివితక్కువతనము 2. అశక్తి అనగా దుర్బలత 3. లేమి -దరిద్రము

అజ్ఞానము అనగా తెలివితక్కువతనము: దీనికారణముగానే మనిషి క్రమ విరుద్ధంగా ఆలోచిస్తాడు. ఏది ఆలోచించకూడదో అదే ఆలోచిస్తాడు మరియు ఇబ్బందులలో చిక్కుకొని కలత, వ్యాకులత మరియు దుఃఖితుడై ఉంటాడు. తన శక్తి మరియు సామర్థ్యము యొక్క సరైన జ్ఞానము లేనందున ఎటువంటి అసంభవమైన పనులకు పూనుకుంటాడనగా వాటిలో అపజయము మరియు నిరాశయే చేతికందుతుంది. ఇతర వ్యక్తులు మరియు చుట్టూ ఉన్నదాని గురించిన నిజమైన సమాచారము లేని కారణముగా అబద్ధపు ఆశ-కోరిక మరియు కల్పనలలో జీవిస్తాడు. చివరకు భిన్నత మరియు నిరాశలో ఊపిరాడక దుఃఖిస్తూ ఉంటాడు. తన తెలివితక్కువ వలన తరువాత లభించే లాభమును గురించి ఆలోచించక క్షణిక సుఖము మరియు లాభము యొక్క చట్రములో ఎటువంటి పని చేసి కూర్చుంటాడనగా తరువాత దుఃఖము మరియు పశ్చాత్తాపమే చేతికి అందుతుంది.

వ్యతిరేక ఆలోచనల కారణంగానే చిన్న చిన్న మాటలు కూడా బాగా దుఃఖముతో నిండి ఉన్నట్లు కనబడుతాయి. అనుచర బంధువుల మృత్యువు, స్నేహితుల యొక్క వ్యతిరేకమైన కోరికలు మరియు పరిస్థితులలోని హెచ్చు-తగ్గులు మొదలైనవి. స్వాభావికం, కాని తన అజ్ఞానం కారణంగా వ్యక్తి వీటిని కాదని ఎలా ఆలోచిస్తాడంటే నేను ఎలా

కోరుకుంటే అలా జరగాలి. ప్రతికూలత అనేదే ఎదురు కారాదు. ఇటువంటి అసంభవమైన ఆశకు వ్యతిరేకంగా ఘటన జరిగినపుడు భారీగా నష్టం జరుగుతుంది.

<u>అశక్తి అనగా దుర్బలత :</u> మనిషిని అడుగడుగునా ఘోరమైన బాధ మరియు యాతన నిండిన జీవితమును జీవించుటకు వివశుడను చేస్తుంది. ఇంతలో వ్యక్తి తన స్వాభావిక మరియు జన్మసిద్ధహక్కుల భారమునైనా తన భుజముల పైకెత్తుకొనుటకైనా సమర్థుడు కాలేడు మరియు అది లేకుండా పోయి దీన-హీన మరియు దరిద్ర-దయనీయ పరిస్థితిలో పడి ఉండుట కొరకు గత్యంతరము లేకుండా పోతుంది. ఆరోగ్యము చెడిపోతే అస్వస్థతో చుట్టు ముట్టబడి ఉంటే రుచికరమైన భోజనం, మధుర సంగీతం, సుందర దృశ్యము, ధనము, సంపద మరియు జీవితంలోని ఇతర సుఖ -సాధనములు చెప్పదగిన సుఖములనే ఇవ్వజాలవు. బదులుగా భారీ ఆకారము మరియు దుః ఖము ఇచ్చేదిగానే అనిపిస్తాయి.

బుద్ధి సంబంధ దుర్బలత కారణముగా వ్యక్తి సాహిత్యము, శాస్త్రము, కావ్యము, విజ్ఞానము మొదలైన వాటి అధ్యయనము మరియు చింతన - మననము యొక్క ఆనందము గ్రహించలేడు. ఆత్మ సంబంధమైన నిర్బలత కారణముగా స్వాధ్యాయము, సత్సంగము, భజన -భక్తి మొదలైన వాటి ఆనందము దుర్లభమే అయిపోతుంది. ఇంతేకాక బలహీనులైన వారిని నాశనము చేయుటకు ప్రకృతియొక్క "ఉత్తములైన వాటిని రక్షించు" సిద్ధాంతము పని చేస్తుంది. నిర్బలురను నశింపజేయుటకను, పీడించుటకొరకు అనేక వస్తువులు ప్రకటమౌతాయి. చిన్న చిన్న మాటలు కూడా అతనికి భారమౌతాయి. చల్లదనము క్రీడాకారులకు బలమునిస్తుంది, బలహీనులకు చల్లదనము నిమోనియా మరియు కీళ్ళవాతము వంటి సమస్యలను ముందు నిలబెడ్తుంది. బలహీనులకు దుఃఖములు-కష్టములే కాక మంచి తత్వములు కూడా ఆశాజనకమైన లాభమును ఇవ్వలేవు. అదే బలమైన

వీరులు దుఃఖములు -కష్టములతో నిండిన సవాళ్ళ మధ్యనే తన శక్తి మరియు గుణములను వికసింప చేసుకుంటాడు.

సాధనముల లేమిలో యోగ్యుడు మరియు సమర్థుడైన వ్యక్తి కూడా దిక్కులేని వానిగా మరియు అంగవిహీనునిగా తలుస్తాడు. మరియు దుఃఖమును పొందుతాడు. అన్న -వస్త్రములు, మిత్రులు -సహాయోగులు , ధనం -ఔషధం మరియు పుస్తకం వంటి వాటి లేమిలో రకరకములైన బాధలు, కష్టములు ఎదుర్కొనవలసి వస్తుంది. గాయత్రీ రూపంలోని కామధేనువు యొక్క హ్రీం - సద్బుద్ధిని ప్రసాదించునది, శ్రీం-సమృద్ధి ప్రసాదించునది మరియు క్లీం - శక్తిని ప్రసాదించునది, మూడు శక్తులు సాధకుని అజ్ఞానము, అశక్తి మరియు అభావముల వలన జనించిన కష్టములను నివారిస్తూ అతని దుః ఖములను దూరం చేస్తుంది.

<u>ప్రతి యుగములో గాయత్రీ మహిమ యొక్క గుణగానము:</u> తన అద్వితీయ విశేషతల కారణంగానే గాయత్రీ మహాశక్తికి భారతీయ సంస్కృతి యొక్క జనని అయ్యే గౌరవం లభించినది. ప్రతి యుగములో ఋషులు, మునులు, మహా పురుషులు మరియు విద్వాంసులు దీని మహిమను గానం చేశారు. ఇతర విషయములో వారికి భేదములుండవచ్చు గాని గాయత్రీ విషయంలో వైదిక యుగము నుండి ఆధునిక సమయం వరకు అందరూ ఒకే ఉద్దేశ్యంతో గాయత్రీ యొక్క మహిమను అంగీకరించారు.

అథర్వవేదముః లో గాయత్రిని స్తుతిస్తూ ఇది సాధకునకు ఆయుష్షు, ప్రాణము, శక్తి, కీర్తి, ధనము మరియు బ్రహ్మతేజము ఇచ్చునదిగా చెప్పబడినది. విశ్వామిత్రుని కనుగుణంగా గాయత్రీ మంత్రమునకు సమానమైన నాలుగు వేదములలో ఏ మంత్రమూ లేదు. మనువు చెప్పినట్లు గాయత్రిని మించి పవిత్రము చేయునది వేరే ఏ మంత్రమూ లేదు. యోగిరాజు యాజ్ఞవల్క్యుడిననుసరించి త్రాసులో

ఒకవైపు సమస్త వేదములను, రెండవవైపు గాయత్రిని ఉంచి తూచిన గాయత్రి ఉన్న సిబ్బ బరువుగా ఉంటుంది. అత్రి ముని ననుసరించి గాయత్రీ తత్వమును బాగా అర్థము చేసుకున్న వ్యక్తికి ప్రపంచములో ఏవిధమైన దుఃఖము మిగలదు. మహర్షి వేదవ్యాస్ ఏమన్నారంటే ఏవిధముగా పండ్లరసము (తేనె) తియ్యగా, పాల యొక్క సారము నెయ్యిగా అవుతుందో అదేవిధముగా వేదముల సారము గాయత్రి. సిద్ధిపొందిన గాయత్రి కామధేనువుతో సమానము. రుషి భరద్వాజననుసరించి బ్రహ్మాది దేవతలు కూడా గాయత్రీ జపము చేస్తారు. అది బ్రహ్మ సాక్షాత్కారము చేయించునది. నారదుడు చెప్పినట్లు గాయత్రి భక్తి యొక్క స్వరూపమే. ఎక్కడ భక్తి స్వరూపమైన గాయత్రి ఉంటుందో అక్కడ నారాయణుడు నివాసముండుటలో ఏమీ సందేహముండదు.

ఇదేవిధమైన ఆలోచనలు షుమారుగా రుషులందరివీ కలుస్తాయి. బుద్ధి, తర్కము మరియు ప్రత్యక్షవాదము యొక్క ఈ యుగము యొక్క దార్శనికులు మరియు ఆధ్యాత్మిక మహాపురుషులు కూడా గాయత్రీ మహత్మ్యమును ప్రాచీనకాలములోని ఋషి-ముని జనులు అంగీకరించినట్లు అంగీకరించారు. రవీంద్రనాథ టాగూరు ననుసరించి భరతవర్షమును మేల్కొలిపే మంత్రము ఎంత సరళమంటే దానిని ఒక శ్వాసలోనే ఉచ్ఛరించవచ్చును. అదే గాయత్రీ మంత్రము స్వామి వివేకానందుడు ఇది సద్బుద్ధికి మంత్రమైన కారణముగా మంత్రములలో మకుట మణిగా భావిస్తారు. రామకృష్ణ పరమహంస దీని అద్భుత శక్తిని విశ్వసించారు. దీర్ఘమైన సాధనలకు బదులు ఈ చిన్న గాయత్రీ సాధన చేయమని సలహా ఇచ్చేవారు. మదన మోహన మాలవీయ గారు ఇది రుషులచే ఇవ్వబడిన అమూల్యమైన రత్నములలో సర్వోన్నతమైనదని అంగీకరించారు. ఇది ఆత్మను ప్రకాశింపజేసి అన్ని బంధముల నుండి విముక్తము చేస్తుంది. లౌకికమైన లేమిని దూరం చేస్తుంది. లోకమాన్య తిలక్ ఏమనేవారంటే పూర్ణ స్వాతంత్ర్యము కొరకు

మనము రాజకీయ విప్లవంతో పాటు ఆత్మలో ప్రకాశమును జనింపచేయాలి. ఈ పని చేసే ప్రచండ సామర్థ్యము గాయత్రీ మంత్రములో బాగా ఉన్నది. మహాత్మాగాంధీ దీని యొక్క రోగ రక్షక, శాంతిదాయక మరియు ఆత్మకొరకు ప్రగతి కారక ప్రభావమును విశ్వసించేవారు. యోగి అరవిందులు దీనిని ఆత్మయొక్క వి భిన్న స్థాయిలను ప్రకాశింపజేసే ప్రచండ శక్తిగా విశ్వసించేవారు. గాయత్రీ మంత్రము ఎన్నో మంత్రముల సాధనతో సమానము అని ఆయన చెప్పారు.

జగద్గురు శంకరాచార్య చెప్పినట్లు గాయత్రీ ఆది మంత్రము .దీని మహిమ యొక్క గానము మనిషి సామర్థ్యమునకు మించినది. జీవిత లక్ష్యమును సాధించే తెలివి ఏ బుద్ధితో లభిస్తుందో, దానికి ప్రేరణ గాయత్రీ ద్వారా జరుగుతుంది. స్వామి రామతీర్థ చెప్పారు. రాముని పొందుట అన్నింటికంటే పెద్ద పని, మరియు గాయత్రీ ద్వారా శుద్ధి చెందిన బుద్ధి మాత్రమే రాముని పొందగలదు. ఎస్. రాధాకృష్ణన్ చెప్పారు ఇది జీవిత పరంపరతో జతపరచే సార్వభౌమ ప్రార్థన. ఇది మంచి లాభమునిస్తుంది. ఆర్య సమాజమునకు చెందిన స్వామి దయానందుడు దీనిని అన్నింటికంటే శ్రేష్ఠమైన మంత్రము, వేదముల ప్రధాన గురుమంత్రముగా విశ్వసించారు. వారు శ్రద్ధతో దీనిని ఉపాసన చేశారు. మరియు ఇతరులను కూడా దీని జపము మరియు పురశ్చరణ సాధనల కొరకు ప్రేరేపించేవారు. థియోసాఫికల్ సొసైటీ యొక్క శ్రేష్ఠ సాధకుడు ప్రొ.ఆర్.శ్రీనివాస్ మాటలలో గాయత్రీ యొక్క అర్థము. రహస్యమును  మనసు మరియు హృదయములో ఏకాగ్రము చేసి ఎవరైనా శుద్ధముగా ఉచ్ఛారణ చేస్తే దాని సంబంధము సూర్యునిలో ఉండే మహాశక్తితో జోడించబడినది. దానివలన అతని లోపల - బైట ఒక బ్రహ్మాండమైన ఆధ్యాత్మిక ప్రభావం జనిస్తుంది.

ఈ అన్ని భావముల ద్వారా స్పష్టమయ్యేదేమనగా గాయత్రీ

ఉపాసన ఏదో అంధవిశ్వాసము లేక అంధ పరంపర కాదు, బదులుగా దాని వెనుక ఆత్మోన్నతి కలిగించే గట్టితత్త్వము దాగి ఉన్నది. భౌతిక దృష్టిలో కూడా వ్యక్తిని ధనవంతునిగా చేయుటలో సామర్థ్యమున్నది.

గాయత్రి శక్తి కంటే వేరే ఇతర మార్గమేమీ లేదు - జీవితములో సద్బుద్ధి కలిగిన తరువాతనే బాహ్య సఫలత మరియు సుఖము-సమృద్ధి యొక్క రాజమార్గము తెరుచుకుంటుంది. ఈ రూపంలో గాయత్రీ శక్తియొక్క ఆశ్రయం తీసుకొనుట తప్ప వేరే మార్గము లేదు. ఇదేవిధముగా ఈశ్వర ప్రాప్తి, ఆత్మ దర్శనం లేక జీవన్ముక్తి మొదలైన లక్ష్యములను విశ్వసించువారి కొరకు కూడా గాయత్రీ తత్త్వమును నమ్మక వేరే మార్గములో వెళ్ళుట అసంభవము, ఎందువలననగా కేవలం ఈశ్వరప్రాప్తినే జీవితలక్ష్యముగా కలవారు కూడా తెలుసుకొనవలసినదేమంటే పరమాత్మ స్వయంగా నిరాకారుడు మరియు గుణాతీతుడు. ఆయన ఇంద్రియముల పట్టుకు దొరకడు. మరియు బుద్ధి చింతన యొక్క సామర్థ్యమునకు దూరము. ఆయన ఎవరినీ ప్రేమించడు మరియు ద్వేషించడు. ఆయనను సూటిగా చేరలేము.

జీవాత్మ మరియు పరమాత్మ మధ్య సూక్ష్మ ప్రకృతి యొక్క చిక్కటి పరదా పడి ఉన్నది. ఈ పరదాను దాటుటకు ప్రకృతి సాధనములతోనే పనిచేయాలి. చింతన - మననం, ధ్యానము- ప్రార్థన, వ్రతము-అనుష్ఠానము మరియు సాధన వంటి అన్ని ఆధ్యాత్మిక ఉపచారములు ఈ ఉద్దేశ్యము కొరకే ఉన్నాయి. వీటన్నిటిని వదిలి పరమాత్మను పొందుట ఏవిధముగాను వీలుకాదు. సత్వగుణము మాయ మరియు చిత్ శక్తిద్వారా మాత్రమే జీవాత్మ మరియు పరమాత్మ యొక్క కలయిక జరుగగలుగుతుంది. ఈ ఆత్మ పరమాత్మల కలయికను జరుపగలిగే శక్తి గాయత్రియే. గాయత్రి రూపంలోని మెట్లను ఎక్కుతూనే పరమాత్మ రూపంలోని పై కప్పు వరకు చేరగలుగుట జరుగుతుంది.

నిజమేమిటనగా సాక్షాత్కారం యొక్క అనుభవం గాయత్రి గర్భంలోనే జరుగుతుంది. దీనికంటే పైకి చేరినపుడు సూక్ష్మ ఇంద్రియములు మరియు వాటి అనుభవ శక్తియే లుప్తమై పోతుంది. అందువలన భక్తి మరియు ఈశ్వర ప్రాప్తి కోరేవారు కూడా గాయత్రితో కలిసియున్న పరమాత్మని, రాధే - శ్యామ్, సీతారాముడు, లక్ష్మీనారాయణ, పార్వతి-శివుల యొక్క ఉపాసనే చేస్తారు. సరస్వతి, లక్ష్మి, కాళి, మహామాయ, సీత, రాధ, సావిత్రి, పార్వతి మొదలైన రూపములలో గాయత్రీ ఉపాసనే చేయబడుతుంది.

గీతలో భగవాన్ కృష్ణుడు స్వయంగా చెప్పాడు " గాయత్రీ ఛందసామహమ్" అనగా గాయత్రీ నేనే. భగవంతుని ఉపాసన కొరకు గాయత్రి కంటే గొప్పది వేరే ఏ మంత్రమూ ఉండజాలదు. కనుక బ్రహ్మ ప్రాప్తి కొరకు గాయత్రి అవసరము లేదు అనే ఆలోచన అజ్ఞానము మాత్రమే. ఇదైతే అనివార్యము. పేరుతో ఎవరైనా వ్యతిరేకించవచ్చును లేదా ఆపద కలిగించవచ్చుననేది వేరే మాట గాని గాయత్రి శక్తిని కాదని వేరే మార్గములో వెళ్ళుట అసంభవం.

గాయత్రీ మాత రూపంలో విశ్వనారి యొక్క పవిత్ర ఉపాసన-గాయత్రీ ఉపాసనలో భగవంతుని మాత రూపంలో భజించే మంచి అవకాశము లభిస్తుంది. ప్రపంచంలో తల్లిప్రేమ అన్నింటికంటే పవిత్రము, నిర్మలము మరియు ఉచ్ఛకోటికి చెందినది. తల్లి తన పిల్లలను ఎంతగా ప్రేమిస్తుందంటే అంతగా ఏ ఇతర బంధువూ చేయలేరు. వయసు పొంగులో భార్య భర్తలలో కూడా అధికమైన ప్రేమను చూస్తాము కాని నిజముగా ఇది తల్లి ప్రేమతో పోల్చినపుడు చాలా తేలికైనది మరియు అంత లోతైనది కాదు. ప్రేమ పరస్పరం ఇచ్చి పుచ్చుకొనుట, స్వార్థము, ఆశ - అపేక్షలపై ఆధారపడినది. ఇందులో ఏదైనా తక్కువైనా లేక విఘ్నము కలుగగనే ఈ ప్రేమ విరోధముగా మారుటలో ఆలస్యముండదు. కాని తల్లిప్రేమ ఈవిధమైన దోషములు

మరియు విఘ్నములు బాధలనుంచి విముక్తమైనది. శిశువు-సంతానము నుండి ప్రతిఫలము లభించకపోగా అనేక కష్టములే కలుగుతాయి. అయినా కాని ఆమె వాత్సల్యముతో పరమ సాత్వికమైన ప్రేమధారను బాలునికి త్రాగిస్తూ ఉంటుంది. చెడు కుమారుడైనా గాని తల్లియొక్క భావనలు తగ్గవు. పుత్రుడు చెడ్డవాడు కావచ్చుగాని చెడ్డమాత ఉండజాలదు" అన్న సామెత ఉన్నది.

భగవంతుని మనం ఏ రూపంలో భావన చేస్తామో, ఆయన అదే రూపంలో మనకు జవాబు ఇస్తారు మరియు అనుభూతి చెందుతాము. మనం భగవంతుని ప్రేమిస్తాము మరియు ఆయన అనన్య ప్రేమను పొందాలని కోరుతాము. అపుడు తల్లి రూపంలో ఆయనను భజించుట అన్నింటికంటే సరైన మరియు అనుకూలమైనదిగా ఉంటుంది. తన కుమారునిపై తల్లి వాత్సల్యం ఎలా ఉంటుందో అటువంటి ప్రేమ ప్రతిఫలము పొందుటకు భగవంతునితో మాతృ సంబంధమును స్థాపించుట ఆత్మ విద్య యొక్క మనో వైజ్ఞానిక రహస్యముల ఆధారంపై ఎక్కువ ఉపయోగకరము మరియు లాభదాయకముగా రుజువవుతుంది. భగవంతుని తల్లిగా భావించి జగజ్జనని వేదమాత రూపంలో వారి ఉపాసన వలన భగవంతుని వైపునుండి ఎటువంటి ప్రతిక్రియ ఉంటుందంటే తల్లికి తన పిల్లలపట్ల ఉన్నట్లుగా. మాతయొక్క ఒడిలో బాలుడు తనను తాను అందరికంటే ఎక్కువ ఆనందంగా మరియు సురక్షితము - సంతుష్టముగా భావిస్తాడు.

పురుషులకు నారీశక్తి అన్నివిధముల ఆదరణీయము, పూజనీయము మరియు పోషణీయమైనది. పత్ని రూపంలో, సోదరి మరియు తల్లిరూపంలో ఆమె మైత్రికి యోగ్యమైనది, స్నేహం చేయుటకు యోగ్యమైనది మరియు గురువువలె పూజనీయమైనది. పురుషుని ఎండిన అంతరంగంలో నారిద్వారా అమృతం నింపబడకపోతే శాస్త్రజ్ఞుల ననుసరించి అది బాగా ఎండిపోయి, అనాగరికముగా,

కర్కశముగా, క్రూరముగా, నిరాశతో, సంకీర్ణముగా మరియు అవికసితముగా ఉండిపోతుంది. వర్షముతో ఎలా భూమియొక్క హృదయము పులకిస్తుందో మరియు దాని సంతోషమే పచ్చదనము మరియు పూలు ఫలముల రూపంలో మొలకెత్తుతుంది. పురుషడు కూడా స్త్రీ యొక్క స్నేహ వర్షముతో ఇదేవిధముగా తడిని పొంది తన శక్తిని వికసింపజేసుకుంటాడు. కాని ఒక పెద్ద విఘ్నము ఈ మార్గములో వస్తుంది. అది అమృతమును విషముగా మారుస్తుంది మరియు అది కోరిక యొక్క విఘ్నము. దురాచారము, చెడుదృష్టి మరియు కోరిక కలియుట వలన పురుషుడు- స్త్రీ కలయుట వలన లభించే అమృతఫలము విషజమౌతుంది.

ఈ విషము యొక్క వికారమును శమింపజేయుటకు గాయత్రీ సాధన బాగా ఉపయోగకరము. విశ్వనారి రూపములో భగవంతుని మాతృభావంతో, పరమ పవిత్ర భావనలతో ఉపాసించుట, మాతృ జాతి పట్ల పవిత్రతను చాలా ఎక్కువగా పెంచుతుంది. ఈ దిశలో ఎంత సఫలతో లభిస్తుంటుందో అదే అనుపాతంలో ఇంద్రియ సంయమనము, మనో నిగ్రహాము మరియు మనోవికారముల అణచివేత తమంతతామే జరుగుతూ ఉంటాయి. మాతృభక్తి కలవాని హృదయంలో దుర్భావనలు ఎక్కువసేపు ఉండలేవు. విశ్వనారి రూపంలో భగవంతుని ఉపాసన పురుష రూపము కంటే శ్రేష్ఠమైనదని రుజువవుతుంది.

గాయత్రీ ఉపాసన యొక్క సరళమైన విధివిధానము(పద్ధతి): గాయత్రీ ఉపాసన ఎప్పుడైనా ఎటువంటి స్థితిలోనైనా చేయవచ్చును. ఇది ఎటువంటి స్థితిలోనైనా లాభదాయకము. ఇందులో ఎటువంటి హాని జరిగే అవకాశం లేదు, కాని విధిపూర్వకమైన సాధన ఒక మహత్వపూర్ణ విషయము. ఏదైనా పనిని పద్ధతి ప్రకారం లేక సరైన విధానంలో చేస్తే దానివలన సరైన పద్ధతిలో ప్రయోజనం కలుగుతుంది. అందువలన

గాయత్రీ సాధకుడు ఉపాసన యొక్క పద్ధతి, దాని ఉద్దేశ్యము మరియు తక్కువ కర్మకాండలతో జోడించబడిన భావనలను అర్థం చేసుకోవాలి.

నియమిత ఉపాసన కొరకు పూజా స్థలము స్థాపన ఆవశ్యకము. ఇంటిలో ఏకాంతంగాను, ప్రశాంతంగాను ఉండే స్థలమును ఎన్నుకోవాలి. పూజా పీఠముపై సాకార ఉపాసన కొరకు గాయత్రీ మాత యొక్క ప్రతిమను స్థాపిస్తారు. నిరాకారంలో ఈ కార్యము సూర్యుని చిత్రము లేక దీపము, అగరుబత్తి మొదలైన వాటితో చేయవచ్చును. దేవస్థాపనలో శాంతికుంజ్ నుంచి తయారైన చిత్రము కూడా ఈ ఉద్దేశ్యమునకు పనికి వస్తుంది.

ఉపాసన కొరకు ప్రాతఃకాల సమయము అన్నింటికంటే మేలైనది. వీలైనంతవరకు నిత్యకర్మలు, శౌచము, స్నానము మొదలైనవి పూర్తిచేసిన తరువాతే పూజకు కూర్చోవాలి. అస్వస్థత, ఋతుసంబంధ ఇబ్బంది, లేక ఇంకే విధమైన పరిస్థితి కారణంగా చేతులు-కాళ్ళు, ముఖము మొదలైనవి శుభ్రం చేసుకొని కూడా కూర్చోవచ్చు. ఉపాసనతో జోడించబడిన కనీస కర్మకాండ భావనా పూర్వకముగా పూర్తి చేయాలి. ఇతర ప్రదేశములకు వెళ్ళినపుడు కాని లేక ఏదైనా ఇతర గత్యంతరము లేని స్థితిలో పూజా పద్ధతిని స్మరించి మరియు భావన చేసి మానసిక పూజతో పని జరిపించవచ్చును.

బాసిపట్టు వేసుకొని ఆసనముపై కూర్చోవాలి. కష్టము ఉండే ఆసనముల వలన మనసుకు స్థిరత్వం ఉండదు. నేరుగా ఏమీలేకుండా నేలపై కూర్చోనరాదు. దర్భ లేక చాప మొదలైన ఆసనములు సర్వోత్తమమైనది. తులసి లేక చందనపు మాలను తీసుకోవాలి. పూజా స్థలముపై జలముతో నిండిన కలశం మరియు సుగంధభరితమైన అగరుబత్తి లేక దీపమును వెలిగించి పెట్టాలి.

గాయత్రీ ఉపాసనలో ఈ క్రింది కృత్యములు వస్తాయి. 1.

ఆత్మశుద్ధి 2. దేవ ఆవాహన 3. జపము- ధ్యానము మరియు సూర్యార్ఘ్యదానము.

అన్నింటికంటే ముందు ఆసనముపై కూర్చొని ఆత్మశుద్ధి కొరకు శరీరము, మనసు మరియు ప్రాణముల శుద్ధికొరకు 5 కర్మలు చేయబడతాయి. దీనిని బ్రహ్మ సంధ్య అంటారు. అయిదు కృత్యములు 1. పవిత్రీకరణ 2. ఆచమనము 3. శిఖావందన 4. ప్రాణాయామము మరియు 5. న్యాసము

1. పవిత్రీకరణ : ఎడమ అరచేయిలో నీరు తీసుకొని దాని కుడి అరచేతిలో మూయాలి మరియు మంత్రం పూర్తి చేస్తూ ఈ జలమును శిరస్సుపై, శరీరమంతా చల్లుకొండి. ఈ అభిమంత్రిత జలము మాధ్యమం ద్వారా మనపై పవిత్రత వర్షిస్తున్నదని మరియు మనసు లోపల, బైట పవిత్రమవుతున్నామని భావించాలి.

ఓం అపవిత్రః పవిత్రో వా సర్వావస్థాంగతో పివా।
యః స్మరేత్పుండరీకాక్షం స బాహ్యాభ్యంతరః శుచిః ॥
ఓం పునాతు పుండరీకాక్షః పునాతు పుండరీకాక్షః పునాతు।

2. ఆచమనము : నీరు నిండిన పాత్రనుండి కుడి అరచేతిలో నీరు తీసుకొని మూడుసార్లు ఆచమనము చేయాలి. ప్రతి ఒక్క ఆచమనముతో ఆ మంత్రములు ఒకదాని వెంట ఒకటి ఉచ్చరించాలి.

ఓం అమృతో పస్తరణ మసి స్వాహా ।1।
ఓం అమృతాపిధానమసి స్వాహా ।2।
ఓం సత్యం యశః శ్రీర్మయిశ్రీః శ్రయతాం స్వాహా ।।3।।

ప్రతి ఒక్క ఆచమనంతోపాటు గాయత్రి యొక్క మూడుశక్తి ధారలు అనగా హ్రీం సద్బుద్ధి, శ్రీం - సమృద్ధి మరియు క్లీం - శక్తి యొక్క పానము తల్లి పాలను తాగినట్లు భావన చేయబడుతుంది.

3. శిఖాస్పర్శ మరియు వందనం : శిఖలో ముండి ఉండాలి లేక ఈ

భాగమును స్పర్శిస్తూ గాయత్రియొక్క ఈ ప్రతీక ద్వారా ఎల్లప్పుడూ శ్రేష్ఠమైన ఆలోచనలనే అక్కడ స్థాపించాలని భావన చేయండి. ఈమంత్రమును ఉచ్ఛరించండి-

ఓం చిద్రూపిణీ మహామాయే దివ్యతేజః సమన్వితే।
తిష్ఠదేవి శిఖామధ్యే తేజోవృద్ధిం కురష్వమే ॥

4. ప్రాణాయామము : ఇందులో శ్వాసను నిదానముగా లోతుగా పీల్చి ఆపుట మరియు బైటకు తెచ్చుక్రియ వస్తుంది. శ్వాసను పీల్చునపుడు మనకు నాలుగువైపుల వ్యాపించియున్న గాయత్రి యొక్క ప్రాణశక్తిని మనము శ్వాసతోపాటు లోపలకు పీల్చుకొనుచున్నాము అని భావించాలి ఆపు సమయమున సూర్యునితో సమానమైన తేజస్సుగల ప్రాణము మనలో రోమరోమము నందు నిండుచున్నదని భావించాలి. విడుచు సమయమున మన దోష దుర్గుణములు శ్వాసతోపాటు బైటకు పోతున్నాయని భావించాలి. బైటనుండి శ్వాస ఆపుచున్నపుడు తేజస్సుగల ప్రాణము నా పాపములను నాశనము చేస్తూ నానుండి విడిపోవుచున్నది. మరియు లోపల తేజస్సు వృద్ధి అవుచున్నదని భావించాలి. శ్వాసను ఆపే క్రియ శ్వాస తీసుకొను మరియు వదిలే సమయములో సగం సమయం తీసుకొనాలి. ఈ ప్రక్రియను మూడు సార్లు చెయ్యాలి. ఈ మంత్ర ఉచ్ఛారణ తరువాత ప్రాణాయామము చెయ్యాలి-

ఓం భూః ఓం భువః ఓం స్వః ఓం మహః ఓం జనః ఓం తపః ఓం సత్యం
।

ఓం తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియోయోనః ప్రచోయదయాత్।

ఓం ఆపోజ్యోతి రసోమృతం బ్రహ్మభూర్భువః స్వః ఓం।

5. న్యాసము : ఇందులో ఎడమ అరచేతిలో జలం తీసుకొని కుడి చేతి అయిదు వేళ్ళను ముంచాలి మరియు నీటిని ఒకదాని తరువాత ఒకటిగా

మంత్రముతో పాటు నోరు, ముక్కు, నేత్రము, చెవి, భుజము, తొడలు ఎడమనుంచి కుడివైపుకు స్పర్శించాలి. లక్ష్యమేమనగా శరీరము యొక్క అన్ని మహాత్వ పూర్ణ అంగములు మరియు ఇంద్రియములలో పవిత్రత స్థాపన జరుగుతుంది.

ఓం వాంగ్మే ఆస్యేస్తు : (నోరును)
ఓం నసోర్మే ప్రాణోస్తు : (ముక్కు యొక్క రెండు రంధ్రములు)
ఓం అక్ష్ణోర్మే చక్షురస్తు : (రెండు కన్నులు)
ఓం కర్ణయోర్మే శ్రోత్రమస్తు : ( రెండు చెవులు)
ఓం బాహ్వోర్మే బలమస్తు : ( రెండు భుజములు)
ఓం ఊర్వోర్మే ఓజోస్తు : (రెండు తొడలు)
ఓం అరిష్టానిమేంగాని తనుస్తన్వామే సహాసన్తు
(శరీరమును పూర్తిగా)

న్యాసముతో ఆత్మశుద్ధి యొక్క అయిదు కృత్యములు పూర్తి అవుతాయి. వీటి ప్రయోగము సాధకునిలోని మలినత శుద్ధియై మరియు పవిత్రత వృద్ధి యగుటకు చేయబడుతుంది. ఎందువల్లననగా శరీరము, మనసు మరియు ప్రాణములు శుద్ధమైన వ్యక్తియే దైవపూజకు అర్హత కలిగి ఉంటాడు.

దీనితరువాత దైవ పూజయొక్క క్రమము మొదలవుతుంది.

దేవపూజ : ఇందులో అన్నింటికంటే ముందు ధరతీమాత యొక్క పూజ చెయ్యబడుతుంది. మనం జన్మించిన భూమాత, ఆడుతూ- గెంతుతూ పెరిగిన భూమాత ఒడి, ఆ మాతృభూమి ప్రముఖ దైవం. అందువలన ఇష్టదైవం యొక్క పూజకు ముందు భూమిపూజ చేయబడుతుంది. పూజా క్రమంలో ఆమె వలెనే విశాల హృదయం కలిగి, ధైర్యవంతునిగా మరియు సహనశీలిగా ఉండాలనే భావన చేయాలి. భూమిపై ఒక చెంబా నీరు విడిచి ఈ మంత్రముతో పూజించాలి.-

ఓం పృథ్వి త్వయా ధృతా లోకా, దేవిత్వం విష్ణునా ధృతా।
త్వంచ ధారయ మాందేవి। పవిత్రం కురుచాసనమ్ ఓ॥

దీని తరువాత ఆదిశక్తి మాత గాయత్రి మాతను భావంతో నిండిన ఆవాహన చేయాలి. మన ప్రార్ధన కనుగుణంగా మాత గాయత్రి యొక్క శక్తి అవతరించి స్థాపించబడుచున్నదని భావన చేయాలి. ఆవాహన మంత్రము ఈ విధంగా ఉన్నది.

ఓం ఆయాతు వరదేదేవి త్ర్యక్షరే బ్రహ్మవాదిని।
గాయత్రి ఛందసాం మాతః బ్రహ్మయోనే నమోస్తుతే॥

ఓం శ్రీ గాయత్ర్యై నమః। ఆవాహయామి, స్థాపయామి, పూజయామి, ధ్యాయామి। తతో నమస్కారం కరోమి। దీని తరువాత గురువును ఆవాహన చేయాలి. గురువు శిష్యునకు మార్గదర్శనం చేసే భగవంతుని అంశ సద్గురు రూపంలో పూజ్య గురుదేవులు మరియు వందనీయ మాతాజీ యొక్క వందనం చేస్తూ ఉపాసన సాఫల్యము కొరకు గురు ఆవాహనము ఈ మంత్రములతో చేయాలి

ఓం గురుబ్రహ్మ గురుర్విష్ణుః గురురేవ మహేశ్వరః
గురురేవ పరబ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః
అఖండ మండలాకారం వ్యాప్తం యేన చరాచరమ్।
తత్పదం దర్శితం యేన తస్మై శ్రీ గురవే నమః॥

ఓం శ్రీ గురవే నమః ఆవాహయామి, స్థాపయామి, పూజయామి, ధ్యాయామి, తతో నమస్కారం కరోమి।

దేవపూజ తరువాత జపము మరియు ధ్యానము క్రమము మొదలవుతుంది.

జపము : గాయత్రి మంత్రము కనీసము మూడు మాలల జపము లేక గడియారంతో షుమారు 15 నుంచి 20 నిమిషముల లెఖ్ఖతో జపం

చేయాలి. ఎక్కువ చేయగలిగితే ఇంకా మంచిది. సాధారణ క్రమంలో దీనిని 11 మాలల వరకు పెంచవచ్చును. జపం చేయు సమయంలో పెదవులు, కంఠము, నోరు కదిలించుతూ ఉచ్ఛారణ ఎంత మెల్లగా ఉండాలంటే దగ్గరగా కూర్చున్న వ్యక్తి కూడా వినలేనంతగా.

జపమును ఒకవిధమైన మనసును శుభ్రం చేసే రాపిడిగా భావించవచ్చును. వెంట వెంటనే రాపిడి చేయుటవలన వస్తువులు మెరుస్తాయి. సబ్బుతో రుద్దుట వలన బట్టలలోనికి మురికి వదలించబడుతుంది. స్నానం చేయునపుడు రుద్దితే శరీరము యొక్క మురికిపోతుంది. ఈ పనులన్నింటిలో ఒకే పని మరల మరల చేయబడుతుంది. ఇదే పని జపము ద్వారా మనసు మరియు అంతః కరణముతో చేయబడుతుంది. జపము చేస్తూ భగవంతుని తలుస్తూ ఉండుటవలన మన దోష-దుర్గుణములు వదిలించబడుతున్నాయి మనము నిరంతరము శుద్ధము మరియు పవిత్రమగుచున్నాము మరియు దుర్బుద్ధి స్థానములో సద్బుద్ధి స్థాపించబడుచున్నదని భావన చేయాలి.

గాయత్రీ ఉపాసనలో జపముతోపాటు ధ్యానము విడదీయలేనంతగా జోడించబడినది. జపము ముఖ్యముగా శరీర అవయవములద్వారా చేయబడుతుంది, కాని ధ్యానములో మనసును భగవంతునితో జోడించుట మరియు ఒకటిగా చేయు ప్రయత్నం చేయబడుతుంది.

ధ్యానము:- ఇందులో మనము మన కోరిక మరియు స్వభావమున కనుగుణముగా సాకారము లేక నిరాకార ధ్యానమును ఎన్నుకుంటాము. మాతృరూపంలో గాయత్రీ ఉపాసకుడు ప్రాతఃకాలం నందలి బంగారు రంగు గల సూర్యునిలో ఉన్న హంసపై కూర్చుని ఉన్న గాయత్రీ మాతను ధ్యానిస్తాము. తనని తాను శిశువుగా భావించి తల్లియొక్క పైట చెంగునీడలో కూర్చొనుట మరియు ఆమె ఆప్యాయత

నిండిన ప్రేమను పొందుచున్నామని భావన చేయాలి. తల్లిపాలు త్రాగుతూ ఆమె పాలతో పాటు నాకు సద్భావము, జ్ఞానము, మరియు సాహసము-శక్తి వంటి విభూతులు లభిస్తున్నాయని మరియు తన వ్యక్తిత్వము శుద్ధము, వికాసము మరియు ఉన్నతము అవుతూ ఉన్నదని అనుభూతి చెందాలి.

ఈ ధ్యాన ధారణలో కల్పించుకున్న గాయత్రీ మాత ఒక స్త్రీ మాత్రమే కాదు, బదులుగా సమస్త సద్గుణములు, సద్భావనలు మరియు శక్తి - సామర్ధ్యముల ప్రవాహాము భగవంతుని శక్తి అని గుర్తుంచుకోవాలి. క్రమముగా ఇదే స్థాయిపై తన భావన మరియు కల్పనను సాగిస్తుంటే ధ్యానము యొక్క లోతు నిదానముగా పెరుగుతూ పోతుంది. ఇందులో తల్లి-కుమారుల మధ్య ఆట-ఆనందముతో నిండిన స్నేహాము, వాత్సల్యమును ఇచ్చి - పుచ్చుకొనుట జరుగుతుంది. ఈ ధ్యానము మెల్లమెల్లగా భావ భూమిలోనికి దిగుతూ పోతుంది. తన పెద్దరికమును మరిచి బాలుని రూపంలో తన భావనను ధారణను జరుపుతూ సాధన యొక్క ఒక పెద్ద మజిలీ దాటినామని తెలుసుకోవాలి.

మాత యొక్క పాలు త్రాగుటలో ఈ పాలు ఒక తేజోవంతమైన ప్రాణము, భావన కలగాలి. అది తన అంగ ప్రత్యంగములనే కాక మనసు- బుద్ధి మరియు హృదయములో పోగైన చెడు ఆలోచనలు మరియు దోష దుర్గుణములను భస్మము చేయుచున్నది. ఈ పయపానము యొక్క ప్రభావము ఒక కాయకల్పము చేయు సంజీవనీ రసాయనము వంటిదౌతుంది. నేను క్షుద్రుని నుండి మహాత్ముడుగను, నరపశువు- నరపిశాచము నుండి నరమానవుడు -దేవమానవుడుగను, నరుని నుండి నారాయణుని రూపంలోనికి వికసిస్తున్నాను. భగవంతుని యొక్క అన్ని సద్గుణములు నా వ్యక్తిత్వము యొక్క అంగములుగా తయారగుచున్నాయి. నేను తీవ్రత నుండి శ్రేష్ఠత వైపు ముందుకెళ్తున్నాను. నేను వేగముగా పవిత్రత, ప్రఖరత మరియు

ఆత్మవిశ్వాసముతో నిండిపోవుచున్నాను.

నిరాకార ధ్యానంలో గాయత్రియొక్క దేవత సవిత యొక్క ధ్యానము ఉదయాన్నే సూర్యుని రూపంలో చేయబడుతుంది. ఆదిశక్తి యొక్క కాంతి సూర్య కిరణముల రూపంలో మనవరకు వస్తున్నాయి మరియు మనము ఈ ప్రకాశము యొక్క వలయములో నాలుగువైపుల నుండి చుట్టివేయబడి ఉన్నామని భావించాలి. ఈ కాంతి కిరణములు మెల్లమెల్లగా శరీరములోని అంగ-ప్రత్యంగములలో ప్రవేశించుచున్నవి. మరియు వాటిని పుష్టికరము చేయుచున్నవి. నాలుక, జ్ఞానేంద్రియము, నేత్రములు, ముక్కు, చెవి మొదలైన ఇంద్రియములు ఈ తేజోవంతమైన కాంతిచే పవిత్రమగుచున్నాయి మరియు వాటి అసంయమ లక్షణము దగ్ధమై పోవుచున్నది. శరీరము ఆరోగ్యముగా, పవిత్రముగా మరియు స్ఫూర్తివంతమైన తరువాత సూర్యకిరణములు మనసు-మస్తిష్కములోనికి ప్రవేశించినట్లు భావన చేయాలి. ఈ తేజోవంతమైన కాంతి ప్రవేశించగానే అక్కడ ఆవరించిన అసంయమము, స్వార్థము, భయము, భ్రమ రూపంలో జంజాటము యొక్క అజ్ఞానాంధకారము తొలగించబడుచున్నది మరియు అక్కడ సంయమనము, సంతులనము మరియు ఉన్నతమైన ఆలోచనలు వంటి విభూతులు మెరుస్తున్నాయి. మనసు మరియు బుద్ధి శుద్ధము మరియు మేల్కొనుచున్నవి. ఆ కాంతిలో జీవిత లక్ష్యము స్పష్టముగుచున్నది.

మనసు - మస్తిష్కము తరువాత గాయత్రీ శక్తియొక్క కాంతి కిరణములు భావనల కేంద్రమైన హృదయ స్థలములోనికి ప్రవేశిస్తున్నాయి. ఆదిశక్తియొక్క ప్రకాశరూపమైన కాంతి అవతరించుటతోపాటు జీవితము యొక్క అస్పష్టత సమాప్తమగుచున్నది. దాని క్షుద్రత, సంకీర్ణత, తుచ్ఛతను దూరం చేసి దానిని తనతో సమానము చేస్తున్నది. ఉపాసకుడు తన నీచత్వమును

పరమాత్మకు అప్పచెప్పుచున్నాడు మరియు పరమాత్మ తన గొప్పతనమును జీవాత్మకు ప్రసాదిస్తున్నాడు. వేరైపోయిన ఆవు - దూడవలె ఇద్దరూ కలుస్తున్నారు. మరియు ఏకత్వము యొక్క ఆనందము ఉత్పన్నమగుచున్నది. జీవాత్మ యొక్క బలహీనమైన ప్రకాశము, పరమాత్మ యొక్క అత్యధిక బలమైన ప్రకాశముతో కలిసిపోవుచున్నది మరియు దీపంలో మండిపోయే పురుగుల వలె, యజ్ఞ కుండములోపడే ఆహుతి వలె తన అస్తిత్వమును హోమం చేస్తున్నది. ఆ కలయిక వలన హృదయంలో సద్భావనల అలలు పొంగుచున్నాయి.

ఆకాంక్షలు- ఆదర్శవాదము మరియు మంచితనముతో నిండుచున్నాయి. భగవంతుని సందేశములు మరియు మంచి మార్గములో నడవాలనే సంకల్పము దృఢమగుచున్నది. ఆత్మయొక్క మహిమ కనుగుణముగా తన చింతన మరియు క్రియాపద్ధతి ఉండాలనే నిశ్చయము ప్రబలమగుచున్నది. అనంత ప్రకాశము యొక్క ఆనందముతో నిండిన సాగరములో స్నానం చేస్తూ ఆత్మ తనను తాను ధన్యము మరియు కృతకృత్యమయినట్లు భావించుచున్నది.

సూర్యార్ఘ్య దానము- జపము, ధ్యానము పూర్తి అయిన తరువాత పూజా వేదికపై ఉంచబడిన చిన్న కలశమందలి జలము సూర్యుని దిశలో అర్ఘ్యరూపంలో ఈ మంత్రముతో పాటు విడవాలి-

ఓం సూర్యదేవ సహస్రాంశో తేజోరాశే జగత్పతే।
అనుకంపయ మాం భక్త్యా గృహాణార్ఘ్యమ్ దివాకరః॥
ఓం సూర్యాయనమః, ఆదిత్యాయనమః భాస్కరాయనమః॥

ఇక్కడ కలశములో నిండి యున్న జలము తన సంకుచిత మరియు క్షుద్ర అహంకారమునకు ప్రతీక అయితే సూర్యుడు విరాట్ బ్రహ్మకు ప్రతీక. తన జీవితమనే సంపదను విరాట్ బ్రహ్మకొరకు సమర్పితం - విసర్జితం చేయు భావము సూర్యార్ఘ్యములోనున్నది. అర్ఘ్యజలము ఆవిరై ఆకాశములో ఎగిరి వ్యాపకమౌతుంది. ఎక్కడో

మేఘుంగాను, మరెక్కడో మంచు బిందువుగా మారి వర్షిస్తుంది. మన సాధన, సంపద మరియు విభూతి రూపంలోని జీవితమనే జలం కూడా చిన్న కలశంలో పరిమితం కాకుండా బయటకు రావాలి, ఇష్టదేవునికి అర్పితమై విశ్వమానవులకు ఉపయోగపడాలి మరియు బాగా వ్యాపించాలి. ఇదే సూర్యార్ఘ్యము యొక్క భావము మరియు ఉద్దేశ్యము.

గాయత్రీ మంత్రము యొక్క భావ చింతన- జపము- ధ్యానముతో పాటు గాయత్రీ మంత్రము యొక్క అర్ధచింతన బాగా ఉపయోగకరమైనది. దీనిని రోజులో ఇతర సమయములలో కూడా సాగించవచ్చును. గాయత్రీ మంత్రమ యొక్క శబ్దపరమైన భావార్ధము ఈవిధముగా ఉన్నది. ఓం -పరమాత్మా, భూః - ప్రాణస్వరూపం, భువః - సుఖ స్వరూప, స్వః - దుఃఖనాశక, తత్ - ఆ, సవితుః - తేజస్వి ప్రకాశవంతము, వరేణ్యం - ఎన్నుకొనుటకు యోగ్యమైన, శ్రేష్ఠమైన, భర్గః - పాపనాశని, దేవస్య - ఇచ్చునది, ధైవ స్వరూపము, ధీమహి-ధారణచేయు, ధియో - బుద్ధిని, యో - ఏ, నః - మాయొక్క ప్రచోదయాత్ - ప్రేరణ ఇవ్వండి. అనగా ఆ సుఖ స్వరూప, దుఃఖనాశక, శ్రేష్ఠమైన, తేజోవంతమైన, పాపనాశక, ప్రాణస్వరూపుడైన పరమాత్మను మేము ధారణ చేస్తున్నాము. ఆయన మా బుద్ధికి సరైన మార్గములో ప్రేరణ ఇవ్వాలి.

దీని అర్ధమును గురించి ఆలోచిస్తే మూడు విషయములు గోచరమవుతాయి. 1. భగవంతుని యొక్క దివ్యగుణముల చింతన 2. భగవంతుని తమలో ధారణ చేసే భావన 3. సద్బుద్ధిని ప్రేరేపించమను ప్రార్ధన. ఈ మూడు విషయములు తమంత తామే గొప్ప మహాత్మ్యపూర్ణమైనవి.

గాయత్రీ మంత్రము యొక్క మొదటి భాగములో భగవంతుని యొక్క కొన్ని గుణములు చెప్పబడినవి. అవి మనిషి జీవితమునకు అత్యంత మహాత్మ్యపూర్ణమైనవి. భగవంతుని ప్రాణస్వరూపం, దుఃఖ

మరియు పాపనాశక, శ్రేష్ఠం ఆనంద స్వరూపం వంటి గుణములతో నిండిన రూపంపై ధ్యానము ఎంత ఏకాగ్రము చేస్తే, మస్తిష్కములో అవి అంతగా వృద్ధి చెందుతాయి. మనసు వాటివైపు ఆకర్షితమౌతుంది. అభ్యస్తమౌతుంది. మరియు దీని ఆధారంతోనే పని చేస్తాడు. ఈ విధముగా ఒక కొత్త అనుభూతి, ఆలోచనాధార మరియు కార్యపద్ధతి మన జీవితమును అంతర్గత మరియు బాహ్యంగా రెండు విధములుగా రోజురోజుకు ఉన్నతము మరియు శ్రేష్ఠముగా చేస్తూపోతుంది.

రెండవ భాగములో పైన పేర్కొన్న గుణమును కల్గిన పరమాత్మను తనలోనే ధారణ చేసే ప్రతిజ్ఞ ఉన్నది. ఈ గుణము ఉన్న పరమాత్మ కేవలం చింతన చేస్తే చాలదు. బదులుగా గాయత్రీ మంత్రసాధనకును సుదృఢమైన ఆదేశమున్నది. అది ఆ శ్రేష్ఠ గుణములున్న పరమాత్మను తనలోనే ధారణ చేయాలి, ఆయనను తన రోమరోములో పడుగుపేకల వలె కలుపుకోవాలి. ఆయన మన లోపల- బయట నిండి ఉన్నాడు మరియు మన వ్యక్తిత్వము పూర్తిగా ఆయనలో మునిగిపోయినట్లు అనుభూతి చెందాలి. ఈవిధమైన భావధారణ ఎంత సమయము వ్యక్తి కలిగి ఉంటాడో అంత సమయం వరకు అతను లోపల - బయట వికారము మరియు దుర్భావముతో నిండిన దోషముల నుండి విముక్తుడై మరియు తేలికగా ఉంటాడు.

మూడవ భాగములో సద్బుద్ధికి ప్రేరణ ఇవ్వమని భగవంతుని ప్రార్థించబడినది. మనలను చెడు ఆలోచనలనుండి, నీచమైన కోరికలనుండి మరియు దుర్భావనలనుండి విడిపించి సద్బుద్ధితో వివేకముతో నింపాలి.

ఈ ప్రార్థనలో, గాయత్రీ మంత్రము యొక్క మొదటి మరియు రెండవ భాగములో చెప్పబడిన దివ్యగుణములను పొందుటకు, వాటిని ధారణ చేయుటకు ఉపాయము చెప్పబడినది. అది మనము కోరిక - తృష్ణ మరియు అహంకారము యొక్క సంకేతముపై నాట్యమాడే

దుర్బుద్ధిని సరైన మార్గములోనికి తీసుకొని రావాలి. దీనిని శుద్ధ సాత్వికంగా తయారుచేయాలి. ఎలా ఎలా బుద్ధియొక్క దోషము మరియు దారితప్పుట దూరమవుతుందో, అలా అలా సద్గుణములు వృద్ధి చెందుతాయి మరియు అదే నిష్పత్తిలో మన జీవితములో శాంతి, ఆనందము మరియు బాహ్యాముగా సాఫల్యము, సమృద్ధితో నిండిపోతుంది.

గాయత్రికి రెండు పుణ్యప్రతీకలు - శిఖ మరియు యజ్ఞోపవీతము - గాయత్రీ సాధనతోపాటు శిఖ మరియు యజ్ఞోపవీతము రూపములోని పుణ్యప్రతీకలు అవిచ్ఛిన్న రూపంలో జోడించబడి ఉన్నాయి. ఇవి గాయత్రీ మంత్ర దీక్షా సమయంలో ధరించబడతాయి. ఈ విషయంలో ద్విజత్వము అనగా రెండవ జన్మయొక్క మహాత్మ్య పూర్ణ అవధారణ జోడించబడి ఉన్నది. ఇవన్నీ లేకుండా సాధన జరుగజాలదు. లేక గాయత్రీ ఉపాసన చేయబడజాలదు అనే మాట లేదు. భగవంతుని మహాశక్తి గాయత్రిని అనుసరించుటలో ఎటువంటి అడ్డంకి లేదు. కాని తన పుణ్య ప్రతీకలతో పాటు విధి పూర్వకంగా మరియు హక్కుతో అనుసరించబడిన ఉపాసనల లక్ష్యమును తేలిక చేస్తుంది.

శిఖ మరియు యజ్ఞోపవీతము దేవ సంస్కృతి రెండు పుణ్య ప్రతీకలు. ప్రతి గొప్ప బాధ్యతను నిర్వహించు వ్యక్తికి అతని బాధ్యత మరియు కర్తవ్యమును గుర్తుండునట్లు చేయుటకు ప్రతీక చిహ్నాములు ఇవ్వబడతాయి. పోలీసు, డాక్టర్, వకీలు, సిపాయి మొదలైన అందరికీ వారి కర్తవ్యమును గుర్తు చేసే, వారి గొప్పదనము బహిర్గత పరచే గుర్తులు బట్టలతో (డ్రెస్) పాటు జోడించబడి ఉంటాయి. భారతీయ సంస్కృతిలో మనిషి యొక్క చింతన మరియు ఆచరణను పశుత్వం - పిశాచత్వములోనికి వెళ్ళకుండా నిరోధించుట మరియు అతనిని మానవత్వము మరియు దైవత్వము వైపుకు ముందుండుటలోనే

జీవితము సార్థకమౌతుందని ఘోషించబడినది మరియు ఈ మహా ఆదర్శమును అనుసరించే ప్రతివ్యక్తి ద్వారా శిఖ మరియు యజ్ఞోపవీతము రూపములో మహా ప్రతీక చిహ్నములను గౌరవముతో ధరించే విధానమున్నది.

శిఖ మరియు యజ్ఞోపవీతము కేవలము దేవ సంస్కృతి యొక్క గౌరవమైన ప్రతీకలే కాదు. బదులుగా ఉన్నత లక్ష్యము మరియు ఆదర్శముల జీవించి ఉన్న ప్రతినిధులు కూడా దేవసంస్కృతి యొక్క విశ్వాసమేమంటే మనుష్యులందరు జన్మించినపుడు పశుతుల్యులుగా ఉంటారు మరియు వారిలో కూడా కోరికలు, స్వార్థము, ఈర్ష్యాద్వేషములు వంటి అనేక పురాతన అలవాట్లు చూడగలము. వయసు పెరిగిన తరువాత వారిని వీటినుండి దూరంగా ఉండుట, మరియు వాటినుండి విముక్తి చెందుటకు ఉపదేశము ఇవ్వబడుతుంది. ఈ ప్రయత్నమునే సంస్కారము, దీక్ష, ద్విజత్వము, యజ్ఞోపవీతము మొదలైన పేర్లతో పిలుస్తారు.

మొదటి జన్మ తల్లి గర్భమునుంచి జరుగుతుంది. మరియు రెండవ జన్మ ఆచార్యుని ద్వారా చేయబడుతుంది. ఆచార్యుడు తన శిష్యుని మనోక్షేత్రమును శుద్ధి చేస్తాడు. అందులో శ్రేష్ఠమైన ఆలోచనల బీజములను నాటుతాడు. వాటిని తడుపుతాడు. సరిచేస్తాడు మరియు రక్షిస్తాడు. మొదట్లో అడవి వలె ఉండే భూమి సమయము గడిచేకొలది అందమైన తోటగా తయారవుతుంది. ఈ భారీ పరివర్తనను కాయకల్పము లేక రెండవ జన్మ అని కూడా చెప్పవచ్చును. పశుత్వము - పిశాచత్వము యొక్క నీచ మరియు నరక సదృశమైన జీవితమును విడిచి మానవత్వము యొక్క జీవితమును అనుసరించే సంకల్పముతో పాటు ఆచార్యుని ద్వారా ఇవ్వబడిన గాయత్రీ దీక్ష, కొత్త జన్మతో సమానమవుతుంది. ఈ విధముగా గాయత్రీ ఉపాసకుడిని ద్విజుడని పిలువబడతాడు.

ఇప్పుడు జీవితం ఆదర్శముల కొరకు జీవించాలనే ప్రతిజ్ఞతో పాటు ప్రారంభమవుతుంది. యజ్ఞోపవీత ధారణ, ఈ ద్విజత్వము యొక్క ప్రతిజ్ఞ ఘోషణ మరియు నమ్మకం. యజ్ఞోపవీతము ధరించుట తోడే ద్విజత్వము అనగా రెండవ జన్మ ఆరంభమవుతుంది. మరియు సంస్కృతి యొక్క ఈ గొప్ప పరంపర మనుష్యుని ఉన్నతమైన ఆదర్శముల కనుగుణముగా జీవించుటకు ప్రేరణనిస్తుంది. నిజానికి యజ్ఞోపవీతము గాయత్రియొక్క మూర్తీభవించిన ప్రతిమ. ఇతర దేవీ దేవతలను విగ్రహముల రూపంలో ఎక్కడెక్కడో ప్రత్యేక స్థానములలోనే స్థాపించబడతాయి, కాని గాయత్రీ మహాశక్తి యొక్క అన్నింటికంటే ఎక్కువ ఉపయోగమును గమనిస్తూ దానికి ఎంత మహత్వపూర్ణమైన స్థానము ఇవ్వబడినదనగా యజ్ఞోపవీతము యొక్కప్రతిమను ప్రతిక్షణం ఛాతిపై ధరించి హృదయంలో ధారణ చేయుట అవసరమని భావించబడినది.

గాయత్రీ మంత్రము యొక్క శబ్దములు యజ్ఞోపవీతము యొక్క తొమ్మిది దారములు, మూడు ముడులు - మూడు వ్యాహృతులు (భూః భువః స్వః) మరియు ఒక పెద్దముడి బ్రహ్మగ్రంథి, ప్రణవం ఓం యొక్క ప్రతీక. గాయత్రీ రూపమైన పరమాత్మ శక్తిని భుజము, హృదయము, గుండె మరియు నడుముపై ధరించే వారు ప్రతి ఒక్క యజ్ఞోపవీత ధారి నాలుగువైపుల భగవతుని మహాశక్తితో చుట్టబడి బంధించబడి ఉన్నాడు, అందువలన అతను ఎటువంటి భవ్యమైన జీవితము జీవించాలంటే, అది భగవంతుని కోరిక మరియు సంతోషమునకు అనుగుణంగా ఉండాలని విశ్వసించాలి. యజ్ఞోపవీతము మెడలో కట్టబడిన ఒక ధర్మ మార్గము, అది వ్యక్తి ధర్మము, నీతి మరియు సదాచారము యొక్క బంధనములలో బంధించబడి మానవీయ కట్టుబాట్లలో జీవితము జీవించాలని గుర్తుచేస్తుంది.

శిఖ - అదేవిధముగా దేవసంస్కృతిలో, ఆదర్శములతో

నడవాలని సంకల్పించిన వ్యక్తుల యొక్క అనివార్యమైన ప్రతీక చిహ్నము. ఇది మన మస్తిష్క రూపంలోని కోటపై నిలబెట్టబడిన ధర్మ ధ్వజము. ఏవిధముగా ప్రభుత్వ భవనములపై మూడురంగుల జెండా ఎగురుతూ ఉంటుందో అదేవిధముగా ప్రతిగాయత్రీ ఉపాసకుని మస్తిష్కరూపంలోని దుర్గంపై దేవసంస్కృతి యొక్క విజయ పతాకం, శిఖ రూపంలో ఎగురుతూ ఉంటుంది. ఉపాసన సమయంలో శిఖా వందన క్రియ ఒకవిధముగా జెండా వందనము వంటిది.

దీని స్థాపన యొక్క ఉద్దేశ్యము ఇదే. దేవ సంస్కృతి ననుసరించే ప్రతి ఒక్కరి మస్తిష్కము శ్రేష్ఠమైన ఆలోచనలు మరియు ఉన్నత ఆదర్శముల కేంద్రముగానే ఉండాలి. వాటిలో అపవిత్రమైన, నీచమైన మరియు దుష్ట అనైతిక ఆలోచనలకు ఎటువంటి స్థానము లభించరాదు. ఏ రాజు యొక్క కోట ఉంటుందో, అందులో అతని సేన లేక ప్రజలు మాత్రమే నివసిస్తారు. శత్రుసైనికులను అందులో ఒక్క అడుగు కూడా పెట్టనివ్వరు. అదేవిధముగా ఏ మస్తిష్కరూపంలోని దుర్గముపై సద్విచారము యొక్క ధర్మ ధ్వజము శిఖ రూపంలో ఎగురుతుంటుందో, దాని సంరక్షకుల ఆవశ్యక కర్తవ్యమేమనగా నీచము మరియు చెడు ఆలోచనలను తన ఆలోచనా క్షేత్రములోనికి ప్రవేశింపనీయరాదు. మరియు తన ఆచరణ, స్వభావము మరియు చింతనలను ఆదర్శముల కనుగుణముగా రూపొందించుకోవాలి.

మస్తిష్క విద్య ఆచార్యులు శిఖ ఉండు స్థానమును మస్తిష్కము యొక్క నాభి అని చెప్తారు. ఇంకొక విధముగా దీనిని మస్తిష్కము యొక్క హృదయము అని కూడా చెప్పవచ్చును. యోగ విజ్ఞానము ననుసరించి కూడా ఇక్కడ సూక్ష్మ శక్తులు కేంద్రము అయిన సహస్రార చక్రమున్నది. ఈ కేంద్రము అదృశ్య శక్తులతో వ్యక్తియొక్క చైతన్యం ఎలా జోడించబడినదనగా ఫలము మరియు కాడతో ఉన్న సంబంధము వలె. ఈ స్థానమునకు ఏవిధమమైన దెబ్బ, చల్లదనము, వెచ్చదనము వంటి

వాటి కారణముగా హాని కలుగరాదు. ఇందువలన కూడా శిఖ అవసరము.

ఈవిధముగా ఎక్కడ ఆలోచనలను పవిత్రముగా ఉంచు ప్రేరణలు శిఖలో దాగి ఉన్నాయో అక్కడే శరీరము మరియు కర్మను పవిత్రముగా ఉంచు దృఢత్వము యజ్ఞోపవీతము పుట్టిస్తుంది. ఎక్కడ గాయత్రీ యొక్క కర్మ ప్రతిజ్ఞ ఉన్నదో, శిఖ గాయత్రీ యొక్క జ్ఞాన ప్రతిజ్ఞ. కర్మ మరియు రెండింటి కలయిక వలననే మనిషి జీవితమునకు పూర్ణత్వం లభిస్తుంది. ఈవిధముగా యజ్ఞోపవీతము మరియు శిఖ యొక్క స్థాపన ప్రతి ఒక్క గాయత్రీ సాధకునకు ఆవశ్యకమే కాక అనివార్యము కూడా అని చెప్పబడినది. వీటిలో దాగి ఉన్న సందేశములను ధారణ చేయువ్యక్తి పశువునుండి మనిషి, మనిషి నుండి మహాత్ముడు మరియు మహాత్ముడి నుండి భగవంతుడవుతాడు.

గాయత్రీ మంత్ర దీక్ష మరియు గురువరణము- యజ్ఞోపవీతము.

గాయత్రీ మంత్ర దీక్షతో పాటు గురువరణ యొక్క క్రమము అవిచ్ఛిన్న రూపములో జోడించబడినది. గాయత్రీని గురుమంత్రమని కూడా చెప్పబడినది. ప్రాచీనకాలములో బాలుడు గురుకులములో విద్య నేర్చుకొనుటకు వెళ్ళినపుడు అతనికి వేదముల నారంభించే సంస్కార సమయములో గురుమంత్ర రూపంలో గాయత్రీ మంత్రమునే దీక్షగా ఇవ్వబడేది. నేటి గురువులనే పేరుకల గురువులు నానావిధములైన హెచ్చుతగ్గులు కల మంత్రములు చదివి గురుదీక్ష యొక్క గీతలు గీస్తారు. కాని ప్రాచీన కాలంలో గాయత్రీ మంత్రము కాక వేరే ఏ ఇతర దీక్షా మంత్రములు లేవు.

గురువు ద్వారానే వ్యక్తి తన శ్రద్ధ మరియు విశ్వాసమును వికసింపజేస్తాడు. గాయత్రీ సాధన యొక్క సాఫల్యతతో ఈ విషయములకే అన్నింటికంటే ఎక్కువ మహత్వపూర్ణ స్థానమున్నది. ఇవి లేకుండా గాయత్రీ సాధనలో ఆశాజనక సాఫల్యము లభిస్తుందని

నమ్మలేము. శ్రద్ధలేకుండా బాహ్య కర్మకాండలు చిహ్న పూజవలె ఉంటాయి. గురువు మరియు శిష్యుని మధ్య ఎటువంటి శ్రద్ధ యొక్క సూత్ర సంబంధముంటుందో అదే లక్ష్యము వరకు చేర్చుటకు మరియు సాధనను సఫలము చేయుటలో సమర్థమని రుజువగుచున్నది. ఏవిధముగా ప్రారంభములో బాణము-విల్లుతో అభ్యాసము చేసే యోధుడు పెద్దవాడైన తరువాత గొప్ప ధనస్సు, బాణములను ప్రయోగించుటలో సమర్థుడౌతాడో అదేవిధముగా గురువుపై పెరిగి ఉన్న శ్రద్ధ - విశ్వాసము పెరుగుతూ పెరుగుతూ భగవద్భక్తి మరియు ప్రేమ రూపంలోనికి మారుతుంది.

గాయత్రీ మంత్రముపై వశిష్ఠుడు మరియు విశ్వామిత్రుని శాపము గురించి వర్ణన వస్తుంది. ఎవరు ఈ శాపమును ఉత్కీలనము (విమోచనము) చేస్తారో, వారి సాధన మాత్రమే సఫలమౌతుందని చెప్పబడినది. ఈ అలంకారికమైన వర్ణనలో గాయత్రీ సాధనను విధిపూర్వకముగా అనుభవజ్ఞుడు మరియు యోగ్యుడైన మార్గదర్శకుని సంరక్షణలోనే చేయాలనే రహస్యము దాగి ఉన్నది. వశిష్ఠ అంటే అర్థము ప్రత్యేకముగా శ్రేష్ఠమైనది. ప్రాచీనకాలములో, కోటి 25 లక్షల గాయత్రీ జపము చేసినవారికి వశిష్ఠ అనే పదవి ఇవ్వబడేది. వశిష్ఠుని శాప విమోచనము యొక్క తాత్పర్యము ఏమంటే ఈవిధముగా ఎవరైనా అనుభవము కల ఉపాసకుని నుండి గాయత్రీ దీక్ష తీసుకోవాలి. విశ్వామిత్ర అనగా అర్థము - అందరి మంచిని కోరేవాడు, కర్తవ్యనిష్ఠుడు, మరియు సచ్చరిత్రుడు. గాయత్రీ శిక్షకుడు కేవలము వశిష్ఠ గుణములున్నవాడుగా ఉన్నంతమాత్రాన సరిపోదు. అతడు విశ్వామిత్రుడై కూడా ఉండాలి. ఇటువంటి వ్యక్తినుండే విధి పూర్వకముగా గాయత్రీ శిక్ష - దీక్ష తీసుకున్నప్పుడే ఈ మంత్రము ద్వారా సరైన లాభము పొందుట సాధ్యమౌతుంది. తనకు తాను తోచిన విధముగా ఏదో ఒకటి చేస్తూ ఉండుట వలన అధికమైన ప్రయోజనము కలుగజాలదు. ఎవరికి ఇటువంటి మార్గదర్శకుడు లభిస్తాడో అతని సాధన యొక్క సగము

లక్ష్యమును దాటినట్లేనని అర్థం చేసుకోవాలి. ఇదే శాప విమోచనము-ఉత్కీలనము యొక్క రహస్యము. అలా కాక గాయత్రీ వంటి విశ్వమాత మహాశక్తికి ఏ శక్తికి అయినా శాపం ఇవ్వగల సామర్థ్యం లేదు.

గురుదీక్షతో పాటు ప్రారంభం చేయబడిన గాయత్రీ సాధన విశేష రూపంలో ఫలవంతమౌతుంది. ఈ విషయంలో గాయత్రీ సిద్ధింపిన సాధకులు పండిత శ్రీరామశర్మ ఆచార్య గాయత్రీ మహా మంత్రము యొక్క గురుదీక్ష కొరకు ప్రతి గీటు రాయిపై శ్రేష్ఠమైన వారిగా ఋజువు చేయబడ్డారు. ఆయన జీవితం గాయత్రీ ఉపాసన మరియు కఠోర తపస్సాధనలో లీనమైపోయింది. ఆయన చింతన మరియు క్రియాకలాపములు విశ్వకల్యాణము యొక్క భావములతో ఓతప్రోతమై ఉన్నాయి. లుప్తమైపోయిన గాయత్రీ మహా విద్యను మరల ఉద్ధరింపజేయ గాయత్రీ మాత యొక్క ఈ వరపుత్రుని ఆధునిక యుగము యొక్క విశ్వామిత్రుడని అంటే తప్పుకాదు. స్థూల శరీరంతో లేనప్పటికీ వారు సూక్ష్మ మరియు కారణ శరీరములలో ఇంకా అధిక శక్తి మరియు ప్రచండతతో సక్రియులై ఉన్నారు. భావనాశీలురైన భక్తులు మరియు జిజ్ఞాసువులు ఎప్పటికప్పుడు వారి సంరక్షణ, అనుగ్రహము మరియు మార్గదర్శనమును అనుభవిస్తున్నారు. యోగ్యులైన వారి ప్రతినిధుల ద్వారా గాయత్రీ మంత్ర దీక్ష యొక్క క్రమము సాగిపోవుచున్నది. వారి నుండి దీక్ష తీసుకొని గాయత్రీ మహాశక్తి యొక్క విధి పూర్వక ఉపాసన మరియు సాధనను ఆరంభించవచ్చును.

ఉపాసనతోపాటు సాధన కూడా అవసరము - గాయత్రీ ఉపాసనలో జపము - ధ్యానము మొదలైన క్రియలు రోజులో కొద్ది సమయం వరకు మాత్రమే జరుగుతుంది. ఈ మాత్రం చేతనే గాయత్రీ సాధన పూర్తి కాజాలదు. దీనికొరకు ఉపాసనతోపాటు సాధనను కూడా అనివార్యంగా జోడించాలి. ఏవిధముగా అన్నము మరియు జలము, రాత్రి మరియు పగలు, వేడిమి మరియు చల్లదనము, స్త్రీ మరియు

పురుషుల జంటలవుతాయో అదేవిధముగా ఉపాసన మరియు సాధన రెండు పరస్పర పూరకములగు జంట. సాధన లేకుండా చేసే ఉపాసన క్రమము అసంపూర్ణముగానే ఉంటుంది.

పూజ ఉపాసనతో పాటు సాధనాక్రమమును 24 గంటలు అనుసరించాలి. తన యొక్క ప్రతి ఆలోచన ప్రతి క్రియా కలాపముపై ఒక కాపలాదారు వలె గట్టి నిఘా ఉంచవలసి ఉంటుంది. కారణం ఎక్కడైనా ఏదైనా పొరపాటు జరుగకుండా ఉండుటకు ఏవిధముగా శత్రుసీమలో నియుక్తుడైన సైనికులు ప్రతిక్షణం శత్రువు యొక్క నడక మరియు మాటలను తెలుసుకొని యుద్ధము చేయుటకు అప్రమత్తముగా ఉండాలి, అలాగే జీవిత సంగ్రామము యొక్క ప్రతి ఘట్టము వద్ద జాగరూకతతో ఉండవలసిన అవసరము ఉన్నది. ఈ తత్పరతే సాధన. ఇందులో తన ఆలోచన, వ్యవహారం మరియు స్వభావమును అధిక శ్రేష్ఠము మరియు స్వభావమును అధిక శ్రేష్ఠము మరియు గుణవంతునిగా తయారయే నిరంతర ప్రయత్నము చేయవలసి ఉంటుంది. కేవలం జపము - ధ్యానము మరియు ఉపాసనయే అంతా అని కూర్చొని మరియు జీవన సాధన వైపు ధ్యానముంచని కారణముగా సాధన యొక్క లాభము పొందలేరు.

సాధన యొక్క శుభారంభము ఉదయము నిద్రలేవగానే ప్రారంభమవుతుంది. ఇందులో మంచముపై పండుకొని ఉంటూనే తన నిజరూపము, జీవిత లక్ష్యము మరియు ఉద్దేశ్యము యొక్క చింతన మననము చేయబడుతుంది. ఒక కొత్త సంకల్పముతో దినమును ఆరంభించాలి. ఏమంటే దినమును శ్రేష్ఠమైన పద్ధతిలో ఉపయోగిస్తూ దానిని సఫలము మరియు సార్థకము చేస్తాము. ఇందులో దినమంతా చేయు క్రియాకలాపాలు, ఆలోచనా విధానము మరియు దినచర్య యొక్క ఒక సువ్యవస్థితమైన ప్రణాళిక తయారుచేయబడుతుంది. అందులో 1. ఇంద్రియ సంయమము 2. సమయ సంయమనము 3. ఆలోచనా సంయమనము 4. అర్థ సంయమనము అనే నాలుగు

వ్యావహారిక సూత్రములను జాగరూకతతో పాటించబడతాయి.

ఇంద్రియ సంయమములో నాలుక మరియు జననావయముల దురుపయోగంపై అంకుశము ప్రయోగించుట ముఖ్యము. నాలుక యొక్క తిండిపోతుతనము మామూలుకంటే అధికముగా తినుటకు గత్యంతరము లేని పరిస్థితి కల్పిస్తుంది. అది కడుపులో కుళ్ళు ఉత్పత్తి చేసి శరీరములో వివిధ రకములైన వికారములను ఉత్పత్తి చేస్తుంది. మరియు వ్యక్తి యొక్క ఆరోగ్యము మరియు సంతులనమునకు భారీ నష్టము కలుగచేస్తుంది. జననావయవము యొక్క యవ్వన కోరికలకు దాసుడై వ్యక్తి తన జీవశక్తిని చిచ్చుబుడ్డివలె మండించి నాశనము చేయుటకు ఉద్యుక్తుడవుతాడు. దీని అధికత వ్యక్తి యొక్క శరీరము మరియు మనసును నిమ్మకాయవలె పిండి వేస్తుంది. శరీరము శిథిలము మరియు మనస్సు వివిధ రకముల వికారములతో నిండి పోతుంది. వాక్కు యొక్క దురుపయోగము అనవసరపు శత్రుత్వము మరియు గొడవలకు కారణమౌతుంది. ఇది తనవారిని పరాయివారుగా మరియు మనసు వివిధకరముల వికారములతో నిండి పోతుంది. వాక్కు యొక్క దురపయోగము అనపసరపు శుత్రత్వము మరియు గొడవలకు కారణమౌతుంది. ఇది తనవారిని పారియివారిగా మరియు మిత్రులను శత్రువులుగా తయారు చేస్తుంది. ఇంద్రియ సంయమములో నాలుక యొక్క తిండి పోతుతనము, వాక్కు మరియు జననేంద్రియముల దురపయోగము పై అంకుశము ప్రయోగించాలి.

సమయసంయమములో ఎటువంటి తీరిక లేని దినచర్య తయారు చేయాలంటే సోమరితనము, నిర్లక్ష్యము మరియు అనర్థము కలిగించే పనులలో వృథా అయే అవకాశము కలిగించరాదు. సమయమే జీవితము. దీనిని సరిగా ఉపయోగించే మనము కోరిన వస్తువును మరియు సంపదను పొందలము. కనుక ఒక సంతులిత

మరియు సువ్యవస్థిత దినచర్యను అనుసరిస్తూ దినము నందలి ప్రతి క్షణము శ్రేష్ఠమైన పద్ధతిలో ఉపయోగించాలి. అతి ఉత్సాహము పూర్తి చేయుట కష్టమగునట్లుగా మరియు తన సంతులనమును చెడిపోవునటువంటి ప్రణాళిక తయారు చేయవద్దు.

అర్థ సంయమములో సగటు భారతీయ స్థాయి జీవితనిర్వహణ మరియు సాదా జీవితము ఉన్నతమైన ఆలోచనల ఆదర్శములను పాటించాలి. అనవసరపు సేకరణ, వృధా ఖర్చులు మరియు దురుపయోగము వలన ధనము సాధనములను పాదుపు చేయుట ద్వారానే ఈ విషయము నెరవేర్చబడగలదు. విచార సంయమములో చింతనను నిరర్థకము, నీచము మరియు దుష్టకల్పనల నుండి తొలగించి ఉపయోగకరము మరియు శ్రేష్ఠ ప్రణాళికలు మరియు భావనల వలయములోనే ఉంచవలసి ఉంటుంది. అప్పుడప్పుడు చాలా నీచము, సంకీర్ణము మరియు స్వార్థ పూరితమైన ఆలోచనలు మనసులో లేస్తూ ఉంటాయి. వీటిని తొలగించుటకు ముందుగానే ప్రణాళిక తయారు చేసి వ్యతిరేకమైన మరియు శ్రేష్ఠమైన ఆలోచనల ఆయుధములున్న సేనను తయారు చేయవలసి ఉంటుంది. ఈ విషయంలో మంచి సాహిత్యము యొక్క స్వాధ్యాయము చాలా సహాయకారి మరియు ఉపయోగకరముగా ఉంటుంది. దీనిని జీవితక్రమము యొక్క అవిచ్ఛిన్న అంగముగా తయారు చేసుకోవాలి. వాతావరణములో వ్యాపించి ఉన్న దోషపూరిత ఆలోచనల ఛాయ మనసుపై తేలికగానే పడుతుంది . దీనిని శుభ్రము చేయుటకు కూడ స్వాధ్యాయము ఒక అమోఘమైన ఉపాయము. మంచి పుస్తకము యొక్క అధ్యయనము ద్వారా మనము నేరుగా మహాపురుషుల సంపర్కములోనికి వస్తాము మరియు వారి సత్సంగము వంటి లాభమును పొందవచ్చును. దీని కాంతిలో మనసు యొక్క చీకటి కోణములలో దాగి ఉన్న దోష దుర్గుణములు మరియు చెడును స్పష్టమైన రూపముతో దర్శించవచ్చును. వాటిని సంస్కరించే క్రమము కూడ

ఇంకా ఎక్కువ వేగముగా జరుగుతుంది. జీవితలక్ష్యము స్పష్టమౌతూఉంటుంది, మరియు ముందుకు వెళ్ళుటకు అవసరమైన ప్రేరణ మరియు మార్గదర్శనము లభిస్తుంది.

రాత్రి నిద్రపోయే ముందు దినచర్యను గురించిన సమీక్ష, ఉదయం నిర్ణయించుచున్న క్రియా విధానములో సంస్కరణ మరియు మరుసటి దినము ఇంకా మేలైన విధముగా జీవించుటకు ప్రణాళిక తయారు చేయబడుతుంది. ఇందులో 1. ఆత్మ చింతన 2. ఆత్మ సంస్కరణ 3. ఆత్మ నిర్మాణము మరియు 4. ఆత్మ వికాసము యొక్క సూత్రములు అనుసరించబడతాయి.

ఆత్మ చింతనలో, తను దినమంతా చేయు ఆలోచన, వ్యవహారము మరియు దినచర్య విశ్లేషించబడుతుంది. ఇందులో జరిగే పొరపాటు మరియు లోటుపాటులను వెతుకుట, పరిశీలన మరియు పరీక్ష చేయబడుతుంది.

ఆత్మ సంస్కరణలో అభ్యాసములో దోషదుర్గుణముల నుంచి ఏ విధముగా విముక్తి పొందాలనే ప్రణాళిక తయారు చేయబడుతుంది.

ఆత్మనిర్మాణములో ఇప్పటి వరకు లభించని, మన అభివృధికి మరియు ప్రగతికి ఆవశ్యకమైన సద్గుణములను అభ్యాసములోనికి తెచ్చు ప్రణాళిక తయారు చేయబడుతుంది.

ఆత్మ వికాసములో, తనను తాను భగవంతుని అంశ అని నమ్ముతూ విశ్వమంతా తన కుటుంబము అనే ఉన్నత భావన వ్యవహారిక జీవితములోనికి తీసుకొని వచ్చే అభ్యాసము చేయబడుతుంది. దీనికి శుభారంభము పరివార స్థాయిలో సద్భావము, సహిష్ణుత, ఉదారత, సేవ వంటి సద్గుణములతో చేయబడుతుంది. మరియు క్రమముగా సమాజము, దేశము మరియు విశ్వము వరకు విస్తరింపబడుతుంది.

ఉదయము నిద్రలేచిన దగ్గర నుండి నిద్రపోయే వరకు ఈ

పూర్తిగా మూసి వేసినది.

అప్పుడు ఆవశ్యకత ఇంకా ఎక్కువ అవుతుంది. ఈ విధముగా యుగమునకు అన్నిటికంటె మొదటి ఆవశ్యకత సద్బుద్ధిని మేల్కొలిపే గాయత్రి. దానిని నేర్చుకొనుట ప్రాణులందరికీ మేలు చేస్తుంది. ఇది లోకము మరియు పరలోకములను సంస్కరించి సరిచేయునది. ఇటువంటి తపసాధన వేరొకటిలేదు. ఇది ఏదో గారడీ చమత్కారము కాదు. బదులుగా శబ్దశక్తి మరియు భావనాశక్తి యొక్క ప్రత్యక్ష విజ్ఞానము. దీనిని శద్ధాళువులు, అశ్రద్ధాళువు, తార్కికుడు, అతార్కికుడు ఎవరైనా కూడ అనుసరించి తన చెడిపోయిన స్థితిని సరిచేసుకొని మరియు సరిగ్గాయైన వారిని బాగుచేసి తన జీవితమును సఫలము చేసుకొనగలడు.

యుగ సంకటము యొక్క మూలంలో సక్రియమైన దుర్బుద్ధిని సరిచేయుటకు మరల గాయత్రి యొక్క అవతరణ యుగశక్తి రూపములో జరిగినది. సంస్కృతి యొక్క అన్ని పార్శ్వముల వలె ఈ విద్య కూడ అంధకారములో కలసి పోయినది. ఒకటి వ్యాఖ్యలు మరియు ప్రతిపాదనలు కలియుటయే లేదు మరియు కలసినవి ఎంత వివాదాస్పదముగా ఉన్నాయంటే సగటు మనిషి అర్థం చేసుకొనలేడు. ఎవరికైనా ఈ విషయము అర్థమైనప్పటికీ స్వార్థపరులు ఈ మహా విద్యను ఎలా బంధించి ఉంచారంటే ఎవరూ దానిని సాధన చేసే సాహసము చేయలేక పోయారు. గాయత్రి కేవలం బ్రాహ్మణులకేనని, స్త్రీలు అర్హులుకారని, ఇది చెప్పే మంత్రమని, గాయత్రి శాపగ్రస్తమని ఇటువంటి ఎన్నో మూఢ నమ్మకములు ఈ ఉపయోగకరమైన వజ్రమునకు తుప్పు పట్టించారు.

యుగనిర్మాణయోజన యొక్క సూత్ర సంచాలకులు పండిత శ్రీరామశర్మ ఆచార్య తన ప్రచండ తపసాధన ద్వారా ఈ వజ్రమును సానబట్టారు. తన భగీరథ పురుషార్థము ద్వారా గాయత్రి రూపంలోని

జ్ఞానగంగను సర్వమానవజాతి మంచి కొరకు భూమిపై అవతరింపచేశారు. గాయత్రి ఉపాసనను ఎంత సరళము స్పష్టము మరియు సులభతరముగా చేశారంటే ఇది శిక్షితులు అశిక్షితులు, ఆస్తికులు-నాస్తికులు, స్త్రీలు-పురుషులు, ఆరోగ్యవంతులు-రోగిష్టులు అందరి శ్రద్ధకు పాత్రమైనది. గాయత్రీ పరివారము అలాగే గాయత్రి సాధకుల యొక్క మహా సమూహము దీని కేంద్రము హరిద్వార్‌లోని సప్తఋషి క్షేత్రములో, పావన గంగ ఒడ్డున, హిమాలయ ద్వారమున శాంతికుంజ్‌లో ఉన్నది. పురాతన సమయములో ఈ పావన స్థలము ఋషి విశ్వామిత్రుని తపఃస్థలముగా ఉండేది. ఈ యుగములో ఆచార్యశ్రీ మరియు వందనీయ మాతాజీల ప్రచండ తప - సాధన ద్వారా జాగృతము మరియు పోషించబడి ఈ యుగతీర్థము మరియు గాయత్రీ సిద్ధ పీఠము రూపములో ఉద్ధరించబడి ముందుకొచ్చినది. గాయత్రీయొక్క ప్రాణశక్తితో ఓతప్రోతమైన ఈ సజీవ తీర్థములో సాధన సాధకుల మనోవాంఛిత కామనలు పూర్తియగుటయే కాక బదులుగా ఒక కొత్త విశ్వాసము, శక్తి మరియు ప్రకాశము స్వీకరించి తిరిగి వస్తారు. తొమ్మిది దినముల గాయత్రీ సాధనా ప్రధాన శిబిరముల వరుస అనవతరము జరుగుచున్నది. ఇందులో పాల్గొని ఎవరైనా భావనాశీలురైన వ్యక్తి గాయత్రీ మహాశక్తి యొక్క తత్వజ్ఞానమును హృదయాంగమము చేసుకొని మరియు యుగశక్తితో జోడించబడి తన జీవితమును ధన్యము చేసుకొనగలరు.

ఓం భూర్భువః స్వః తత్సవితుర్వరేణం భర్గో దేవస్య ధీమహిః ధియో యోనః ప్రచోదయాత్॥

భావార్థము: ఆ ప్రాణ స్వరూపము, దుఃఖ నాశకము, సుఖ స్వరూపము, శ్రేష్ఠము, తేజస్వి, పాపనాశకము, దేవస్వరూప పరమాత్మను మేము అంతరాత్మలో ధారణ చేయాలి. ఆ పరమాత్మ మా బుద్ధిని సన్మార్గము వైపు ప్రేరేపించాలి.